# ఆకాశ 'వాణి'

## రేడియో ప్రసంగాలు




జెల్లా మార్కండేయ

ప్రసన్న ప్రచురణలు

4-10-32/బి2, శ్రీరాంనగర్

నల్లగొండ-508001

# ĀKASHA VANI

(Radio Talk)

**First Edition:** Nov 2000

**Copies:** 2500

Tiltle: **P. Sudharshan**

Colour Photo: **P. Dasharadha Kumar**

Price: **Rs. 85/-**

For Copies
4-10-32/B2, Sri Ram Nagar,
Nalgonda - 508 001

Composed at:
**Om Teja Graphics**
H.No.3-13-1/4B,Srinivasapuram,
Ramanthapur,Hyd-13
Phone 7035196.

Printed at
**Saraswathi Offset Printers**
Nallakunta, Hyd: Ph: 7612180

Cover Printing at:
**Kalajyothi Process**
పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఆర్థిక సహకారంతో.....

# అంకితం



జీవితకాలమంతా తెలుగుదేశం భారాన్ని మోసి,

నల్లగొండ జిల్లా అభివృద్ధిని కాంక్షించి,

అహరహాలు శ్రమించి మా హృదయాలలో

చెరగని ముద్రగా మిగిలిన ఆత్మీయులు,

పంచాయతీరాజ్ గ్రామీణాభివృద్ధి శాఖామాత్యులు

**కీ.శే. ఎలిమినేటి మాధవరెడ్డిగారికి**

అశ్రుతర్పణంతో అంజలి ఘటిస్తూ...




**CHIEF MINISTER**
**ANDHRA PRADESH**



శ్రీ నారా చంద్రబాబునాయుడు

# సందేశం

పరిపూర్ణ సమాజ వికాసానికి నైతిక, సామాజిక, సాంస్కృతిక విలువలే పునాది. ఈ మౌలిక సూత్రాన్ని విస్మరించకుండా సృజన శక్తితో, ఆకర్షణీయమైన శైలితో పాఠకుడి జీవితాన్ని, తద్వారా యావత్ సమాజాన్ని ప్రభావితం చేయగలిగినదే ఉత్తమ సాహిత్యం అనిపించుకుంటుంది.

శ్రీ జెల్లా మార్కండేయగారు దాదాపు రెండున్నర దశాబ్దాలుగా రేడియో ద్వారా చేసిన కొన్ని ప్రసంగాలను క్రోడీకరించి, ఆకాశ'వాణి' పేరుతో వెలువరించిన గ్రంథం ఇలాంటి ఉత్తమ సాహిత్యం క్రిందికే వస్తుంది. ఈ పుస్తకం అన్ని వర్గాల పాఠకుల ఆదరాభిమానాలకు పాత్రం కాగలదని మనస్ఫూర్తిగా విశ్వసిస్తున్నాను.

(నారా చంద్రబాబు నాయుడు)

**KADIYAM SRIHARI,** *M.Sc.*,
MINISTER FOR SCHOOL EDUCATION,
PUBLIC LIBRARIES, ADULT EDUCATION,
ARCHAEOLOGY & MUSEUMS




*Phones* 3454961 (O)
3459633
3313220 (R)
3303316

HYDERABAD

*Date* ..................

# కడియం శ్రీహరి

శ్రీ జెల్లా మార్కండేయగారిచే 1975 నుండి 2000 సంవత్సరం వరకు ఆకాశవాణి ద్వారా వివిధ అంశములపై గావించబడిన ప్రసంగాలు సంపుటిగా ప్రచురించడం మిక్కిలి ఆనందదాయకం.

ఎక్కడా లభించని భిన్న విభిన్న అంశాలపై చక్కటి భాషలో సామాన్య ప్రజానీకమునకు కూడా అర్థమయ్యే శైలిలో సులువైన రీతిలో, కండ్లకు కట్టినట్లు విషయాలను అందించడంలో రచయిత సాఫల్యం సాధించగలిగారు.

సమాజానికి ఉపయోగపడే ప్రతి అంశమును, మహనీయులు నీతి వ్యాఖ్యలతో, మహిలోక్తులతో జత చేసి సమాజానికి అందిస్తున్న రచయితకు నా అభినందనలు.

కడియం శ్రీహరి.
(కడియం శ్రీహరి)

npith Awardee
. C. Narayana Reddy M.P.
M.A Ph.d. D litt.
AIRMAN
dhra Pradesh State Cultural Council
vernment of Andhra Pradesh
abhavan, Hyderabad - 500 004.
ne : (O) 3214603 (R) 3548451
: (O) 3214603



జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
డాక్టర్ సి. నారాయణరెడ్డి, ఎం.పి
ఎం.ఏ. పి.హెచ్.డి. డి.లిట్.
అధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
కళాభవన్, హైదరాబాదు - 500 004
ఫోన్ (ఆ) 3214603 (ఇ) 3548451
ఫాక్స్ (ఆ) 3214603
తేదీ: 27-09-2000

డా. సి. నారాయణరెడ్డి

# అభినందన

ఈ సంపుటిలోని ప్రసంగాల శీర్షికలను చూస్తే తెలుస్తుంది జెల్లా మార్కండేయగారికి పట్టుబడిన వస్తు వైవిధ్యం, మానవ జీవన వికాసానికి మూలధాతువులుగా ఉపకరించే ఎన్నెన్నో అంశాలను తమ ప్రసంగ విషయాలుగా మలచుకున్నారు మార్కండేయగారు.

ప్రసంగాల రచన వస్తు ప్రధానంగా సాగింది. మధ్య మధ్య ఎన్నెన్నో వేమన్న పద్యాలను, కొన్ని భర్తృహరి సుభాషితాలను ఉదాహరించడం విషయ వివరణకు దోహదకారిగా వుంది.

"పొరుగింటి పుల్లకూర" అనే ప్రసంగంలో పాశ్చాత్య భాషా వ్యామోహం మరిగిన నాలుకలకు చురకలంటించారు మార్కండేయగారు. శతకాలు ఏ రకంగా నీతులకు నిధులో స్పృశించి చూపారు. మాతృ, పితృ, గురు దేవతామూర్తులను గురించి, భారతీయ సంస్కృతి గురించి, సత్యాగ్రహం, అహింస, మాతృదేశం మొదలైన అనేకాంశాలను గురించి జెల్లా మార్కండేయగారు ఆకాశవాణి నుంచి ప్రసారం చేసిన ప్రసంగాలను గ్రంథ రూపంలో అందిస్తున్నందుకు అభినందనీయులు.

(డా. సి. నారాయణరెడ్డి)

Grams "TELVI S

Phone 040-3234815
040-3236911
Res. 040-7037585
Fax. 040-3236045
Email: pstuvc@ap.nic.in

# పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం
# POTTI SREERAMULU TELUGU UNIVERSITY

Prof. N. Gopi
M.A. Ph.D.
VICE - CHANCELLOR



Lalitha Kala Kshetram
Public Gardens, Nampally,
Hyderabad - 500 004. (A.P)

28.10.2000.

# సుభాషిత తరంగాలు ఈ ప్రసంగాలు

-ఎన్. గోపి

గంభీరమైన ఆకృతి, ధవళవస్త్రాలు, బుర్రమీసాలు, చూడడానికి ఠీవి గొలిపే నడక, వెరశి మా అన్న శ్రీ జెల్లా మార్కండేయులు. మనిషి గంభీరుడేగానీ మనసువెన్న. కళ్ళు తీక్షణమేగానీ కరుణగలిగిన శాంతదృక్కులు. మంచివారికి మంచిమిత్రుడు శ్రీ జెల్లా మార్కండేయులు. గత ఇరవైఐదు సంవత్సరాలుగా తాను ఆకాశవాణిలో చేసిన 34 ప్రసంగాలు, వాటిని అలాగే గాలికి వదిలేయకుండా గ్రంథరూపంలో అందిస్తున్నారు ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ పరిషత్ అధ్యక్షులుగా పెద్ద పదవిలో వున్నా మట్టిని మరువని సామాన్యమాన్యుడు శ్రీ జెల్లా.

భారతీయ సంస్కృతి విలక్షణమైంది. విశిష్టమైంది. అన్నిటినీ మించి అతిప్రాచీనమైంది. ప్రపంచవ్యాప్తంగా ఆదరించబడి, ఆచరించబడుతున్న సంస్కృతి. ఇంతటి ప్రాముఖ్యం కలిగిన సంస్కృతిని మనం కాపాడుకుంటూ, దాని ఔన్నత్యాన్ని నిలుపుకుంటూ మనమూలాలను మనం భవిష్యత్ తరానికి వారసత్వ సంపదగా అందిస్తున్నాం. ఇంతటి విఖ్యాతిగాంచిన మన సంస్కృతిని ఈ గ్రంథంలోని తొలివ్యాసం 'భారతీయ సంస్కృతి' తెలియజేసింది.

మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్య దేవోభవ అని ఆర్యోక్తి. చిన్నప్పటి నుంచి పిల్లలకు పై సందేశాన్ని అందిస్తూనే ఉన్నాం. తల్లి బిడ్డకు తొలిగురువు. తర్వాతిస్థానాలు తండ్రి, అధ్యాపకుడు ఆక్రమిస్తారు. తల్లిదండ్రులు జన్మనిస్తే, ఆ జన్మకు సార్థకం చేకూరే విధంగా మార్గదర్శకత్వం వహిస్తాడు గురువు. ఈ

ముగ్గురు వేసే పునాదులే విద్యార్థి జీవితానికి మూలస్తంభాలుగా నిలుస్తాయి. అందుకే దైవంతో సమానమన్నారు ఈ ముగ్గురిని. ఇంతటి ప్రాముఖ్యం కలిగిన తల్లీ తండ్రీ గురువును గురించి మూడు వ్యాసాల్లో చక్కగా అందించారు రచయిత.

ప్రజల జీవితాల్లో వెలుగులు వెదజల్లిన మహనీయులు వేదకాలంనుంచి నేటివరకు ఎందరో ఉన్నారు. స్త్రీలు వివిధరంగాల్లో కీలకపాత్ర వహించిన తీరు, వారి ఔన్నత్యం, శక్తియుక్తులు ఆదికాలం నుంచి స్త్రీల వ్యక్తిత్వాలు, వారి ఆధిక్యత, వ్యవసాయం చేసినతీరు, స్త్రీని మాతృమూర్తిగానే కాక, వ్యవసాయానికి మూలంగా ఈ గ్రంథంలో ప్రస్తావించడం జరిగింది.

సంసారంలో ఆలుమగల అన్యోన్యత వల్ల వొనగూడే సుఖం, కుటుంబంలో భార్యాభర్తల మధ్య అవగాహన లోపిస్తే కలిగే అనర్థం, దాతృత్వం కలిగి ఉండటం, దాతను వేదించక గౌరవాన్ని ప్రదర్శించడంలాంటి లక్షణాలు మానవున్ని చిరంజీవిగా మలుస్తాయి. ఈ అంశాలకు సంబంధించిన వ్యాసాలు, వాటికి ఉపబలకంగా వేమన పద్యాలను ఉటంకించడంవల్ల రచయిత చెప్పదల్చుకున్న విషయానికి నిండుదనం చేకూరింది.

పరోపకారంలోని పరమార్థం, అతిథులను ఆదరించే సంప్రదాయం, దయగల హృదయమే దైవమందిరం అని నమ్మే సదాచారం ఇవన్నీ మన ప్రత్యేకతలు.

'విద్వాన్ సర్వత్రా పూజ్యతే' అన్నారు పెద్దలు. విద్యవలన వినయం, తద్వారా కీర్తి లభిస్తుంది. విద్యను అన్నదమ్ములు పంచుకోలేరు. దొంగలు దోచుకోలేరు. ఇంతటి ప్రాముఖ్యం కలిగిన విద్య, దాని ఆవశ్యకత, విద్యపై భర్తృహరి, వేమనపద్యాల ద్వారా విద్య ప్రాముఖ్యాన్ని తెలియజేశారు.

నైతిక విలువలు పెంచే ప్రశంసలు అవసరం. అదేవిధంగా అరిషడ్వర్గాలను జయించిన మనిషి తనను తాను జయించిన వాడవుతాడు. ఉత్తమమానవుడిగా నిలుస్తాడు. రచయిత అరిషడ్వర్గాల గురించి వివరించిన తీరు, సందర్భోచితంగా వాడుకున్న పద్యాలు వారి విస్తృత అధ్యయనతత్పరతకు దర్పణంగా ఉన్నాయి.

ఇంకా ఈ గ్రంథంలోని 'పరభాషా, సంస్కృతి పై మోజు' లో వ్యవహారంలో తెలుగు లోపించడం, 'సత్యము' లో గాంధీజీ సత్యాగ్రహం, మన పద్యాలలో ప్రతిఫలించే నీతి, 'కాలంవిలువ' 'విశ్వాసం' కలిగి ఉండటం లాంటి అమూల్య సందేశాలను ఈ గ్రంథం ద్వారా పాఠకులకు అందించారు రచయిత.

'వయోజనవిద్య' లో రచయిత అందించిన అక్షరాస్యత వివరాలు 'గ్రామీణ సమస్యలు - పరిష్కారం' 'గ్రామీణ పరిశ్రమలు - ప్రగతికి పట్టుకొమ్మలు' వ్యాసాల్లో వారి వ్యవహారజ్ఞానం తెలుస్తుంది.

ప్రజలు సమాజంలో సుఖసంతోషాల్తో జీవించడానికి, ఆ జీవనం సార్థకం చేసుకోవటానికి వారు ఆచరించాల్సిన విషయాలను ఈ ప్రసంగవ్యాసాలు తెలియజేస్తాయి. ఇవన్నీ రోజూ మనం వింటున్నవే. అయినా ఆచరించం. వాటిని ఆచరించాల్సిన ఆవశ్యకత రచయిత తెలియజేస్తున్నారు. రేడియో కోసం తయారుచేసుకొన్న ఉపన్యాసాలు కాబట్టి సమయం, సందర్భం, స్పష్టత, వాస్తవికత, సామాజిక ప్రయోజనం ప్రతిఫలించే విధంగా ఈ వ్యాసాలు ఉన్నాయి. అదే విధంగా చదివించే గుణం వీటిలో పుష్కలంగా వుంది.

మంచిమనస్సు, సేవాపరత్వం, స్నేహశీలాలను ముప్పేటగా అలంకరించుకున్న శ్రీ జెల్లా మార్కండేయులు వ్యక్తిత్వానికి నిలువుటద్దం ఈ గ్రంథం. రచయితకు నా హృదయపూర్వక అభినందనలు.

గోపి

(ఎన్. గోపి)

# కృతజ్ఞతలు

దాదాపు రెండున్నర దశాబ్దాల కాలం పాటు సామాజికాభివృద్ధిని దృష్టియందుంచుకొని నీతి నియమ క్రమశిక్షణలతో కూడిన చిరు అంశాలపై ఉపన్యాసాలకు అవకాశం కల్పించిన హైద్రాబాద్ 'ఆకాశవాణి' వారికి కృతజ్ఞుడను.

క్షణ క్షణము దేశ అభ్యున్నతిని, పేద బడుగు వర్గాల జీవిత విధానాన్ని మార్చి దారిద్ర రేఖను తుడిచివేయ సంకల్పించి, 'స్వర్ణాంధ్ర ప్రదేశ్'ను కోరుకునే నిరంతర కృషీవలుడు, మన ప్రియతమ యువ నాయకులు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడుగారు, ఈ సంపుటిని చూసి నన్ను ఆశీర్వదించినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

ఆంధ్రప్రదేశ్ పాఠశాల విద్య, గ్రంథాలయ శాఖామాత్యులు, గ్రంథాలయ శాఖలో నా వంతు సేవ చేయుటకు అనునిత్యం చేయూతనిస్తూ, అభివృద్ధికి తోడ్పడుతూ తమ అమూల్యమైన సందేశాన్ని అందించిన శ్రీ కడియం శ్రీహరిగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, విద్యారంగంలో అనేక ఉన్నత పదవులను అలంకరించిన విజ్ఞానఖని, రాజ్యసభ సభ్యులు, ఆంధ్రప్రదశ్ రాష్ట్ర సాంస్కృతిక మండలి అధ్యక్షులు డా. సి .నారాయణరెడ్డిగారు తమ అభినందన సందేశము వ్రాసినందుకు నా కృతజ్ఞతలు.

ఈ పుస్తక రూపానికి మార్గదర్శి తమ అమూల్య సలహా సంప్రదింపులను అందించి నన్ను ప్రోత్సహించి, పుస్తక ప్రచురణకు ఏడు వేల రూపాయల ఆర్థిక సహాయాన్ని అందించిన శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య ఎన్. గోపిగారు, సహృదయంతో సంపుటిలోని ప్రతి అంశాన్ని పరిశీలించి తమ అభిప్రాయాన్ని తెలియజేసినందుకు నా హృదయపూర్వక కృతజ్ఞతలు.

నా బాల్య మిత్రుడు ఈ సంపుటి రూపకల్పనకు సృష్టికర్త అనునిత్యం నాతోవుంటూ ఎల్లవేళలా సహకారాన్ని అందిస్తున్న స్నేహశీలి వృత్తిరీత్యా గ్రంథపాలకుడు అయినా చలనచిత్రరంగంలో డాక్యుమెంటరీ చిత్రాలకు దర్శకత్వం వహిస్తూ రాష్ట్ర నంది అవార్డును పొందిన పి. మధుసూదనరావుగారికి, నాకు సహకరించిన శ్రీ పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ప్రజా

సంబంధాల అధికారి డా. జె. చెన్నయ్యగారికి , ఆకాశవాణి కేంద్రంలో ఎన్నో సూచనలు అందించి నాతో సహకరించిన ఆప్త మిత్రులు, రేడియో ప్రోగ్రాం అధికారులు శ్రీ పి. సుధామ, శ్రీ పి. మధుసూదనరావుగారలకు, ఆర్టిస్టు శ్రీ పి. సుదర్శన్‌గారికి, ఫోటోగ్రాఫర్ శ్రీ పి. దశరధకుమార్‌గారికి, ఎ.ఆర్.పి.యస్ గారికి, తప్పులు లేకుండా అందంగా అక్షరాల కూర్పు చేసిన ఓం తేజ గ్రాఫిక్స్ ప్రసూనకు, కవర్ ముద్రణ చేసిన కళాజ్యోతి ప్రాసెస్‌వారికి, చక్కగా ముద్రణ, బైండింగ్ పూర్తిచేసి పుస్తకాన్ని అందించిన సరస్వతి ప్రింటర్స్‌వారికి నా కృతజ్ఞతలు.

- జెల్లా మార్కండేయ

# విషయసూచిక


| | | సంఖ్య |
|---|---|---|
| 1. భారతీయ సంస్కృతి | - | 1 |
| 2. మాతృదేవోభవ | - | 4 |
| 3. పితృదేవోభవ | - | 6 |
| 4. ఆచార్య దేవోభవ | - | 8 |
| 5. మహాపురుషుల ప్రతిభ | - | 10 |
| 6. గాంధీజీ దృష్టిలో స్త్రీశక్తి | - | 12 |
| 7. చారిత్రక పరిణామంలో ఆచారాలు - స్త్రీమూర్తి | - | 14 |
| 8. ఆలుమగలు | - | 16 |
| 9. దాతకు కోపం తెప్పించకూడదు | - | 18 |
| 10. పరోపకారము | - | 21 |
| 11. అతిథి దేవోభవ | - | 23 |
| 12. మానవసేవయే మాధవసేవ | - | 26 |
| 13. మతం మనిషిని మానవతావాదిగా సత్పురుషునిగా తీర్చిదిద్దాలి | - | 29 |
| 14. మానవజన్మ - పుత్రుని కర్తవ్యం | - | 34 |
| 15. విద్యాధనములు | - | 36 |

16. ప్రశంసించుట - 39
17. అరిషడ్వర్గము - 42
18. కోపము-దాని నివారణోపాయాలు - 45
19. కోపం - క్రోధం - 48
20. పొరుగింటి పుల్లకూర - 51
21. పరభాష, సంస్కృతిపై మోజు - 54
22. సత్యము - 58
23. వర్ణవ్యవస్థలో సత్యం - 60
24. కాలము - దాని విలువ - 62
25. విశ్వాసము - 65
26. శ్రేయోభిలాషి - 68
27. అహింస - 71
28. సత్యాగ్రహం - 73
29. వయోజన విద్య - 77
30. గ్రామీణ సమస్యలు - పరిష్కారం - 83
31. గ్రామీణ పరిశ్రమలు - దేశప్రగతికి
పట్టుకొమ్మలు - 90
32. శతకకర్తలు - నీతికి నిధులు - 98
33. మాతృదేశం - 100
34. మమకారం - 102

# భారతీయ సంస్కృతి

నాగరికత ఉద్భవించినప్పటినుంచి మానవుడు తన ఆలోచనలను, జ్ఞానాన్ని వివిధ రూపాలలో పొందుపరచడానికి ప్రయత్నించాడు. తన ాలోచనలను భాష పుట్టకముందు సంజ్ఞల ద్వారా, గుర్తుల ద్వారా తోటి ానవుడికి తెలియజేయడానికి ప్రయత్నించాడు. భాష ఉద్భవించిన తర్వాత ాతద్వారా తన ఆలోచనలను ఇతరులకు తెలియపరచడానికి ుయత్నించాడు. మనకు తెలిసినటువంటి పురాతనమైన హిందు, గ్రీకు, రోమన్ ాగరికతలు వివిధ రంగాలలో మానవుడు సాధించిన విజయాలను, లోచనలను, విజ్ఞానాన్ని వివిధ రూపాలలో పొందుపరచి భావి తరాలవారికి పయోగపడటానికి ప్రయత్నించాయి. మన విజ్ఞానమే నాగరికత, సంస్కృతి మాజ వికాసాభివృద్ధికి తోడ్పడుతూ వస్తూవుంది.

పవిత్రమైన భారతవ్యవస్థ కుటుంబ వ్యవస్థ. తల్లి, తండ్రి, కుమారులు, మార్తెలు, బంధువులతో కూడిన వ్యవస్థ మనది - నీతి, ధర్మం, ఆచారాలను మ్మేళవించి సత్ప్రవర్తనకై, సత్‌శీలమునకై చట్రంలో బిగించిన వ్యవస్థ మనది. విధంగానే సంఘజీవులమైన మనకు సరియైన మార్గాన్ని, చరిత్రను కుకూర్చడానికి నాగరికత, సంస్కృతులు ఆయువుపట్టులు.

ఒకనాడు ఏ దేశం కండ్లు తెరవని కాలములో సర్వకాలికమైన, ర్వజనీనమైన సంస్కృతి స్వరూపమును సంభావించింది భారతజాతి. ుథాశక్తి అనుష్ఠించింది, ఘనవిజయములు సాధించింది, మరొకరికి ార్గదర్శకమైంది.

మన సంస్కృతికి మూలం వేదములు, వేదశిఖలైన ఉపనిషత్తులు, ోపనిషత్సారభూత భగవద్గీత, సత్యధర్మజ్ఞాన ఘంటాపథములైన మాయణ, భారత, భాగవతాది మహాకావ్యాలు, ఇతిహాసాలు, పురాణాలు, త్వాన్వేషణ పరాయణములైన దర్శనములు. ఇవి ఈనాటివి కావు - ్వమానవ సమాజైక తానములు, ఆయా గ్రంథములలో అంతర

స్నాయువులను అంటి పెట్టుకునియున్న వేదాంతమే విశ్వవిశాలమైన మన సంస్కృతిలోని ఆంతర్యము.

పాశ్చాత్య ప్రభుత్వమునకు సంస్కృతిభిక్ష పెట్టిన గ్రీకు, రోమను సాహిత్యములలోను, తాత్త్విక దృక్పథములలోను, మన వేదాంత వాసనలున్నవని విజ్ఞుల భావన.

పురుషార్థముల గురించియు, సత్యాహింసలు, భూతదయ, విద్యాజ్ఞాన శీలాదులగు మానవుని బహిరంతర వ్యక్తిత్వములను పరిపాలించు బహు విషయముల గురించియు, భారతీయ కోవిదులు చేసిన భావనలు, చెప్పిన పలుకులు రమణీయములైన ఆదేశములు.

లోకమంతటిని ఏకబీజముగా చూడవలసిన ఆవశ్యకతను ఉద్ఘాటించి సమదర్శన స్వరూపమును సంస్కారప్రమాణమును నిరూపించి వసుధైక కుటుంబ నినాదమును, హృదయముతో నుద్ఘోషించిన భారతీయ సంస్కృతి భారతజాతికి మాత్రమే పరిమితమైనది కాదు. అది విశ్వమానవ సమాజ సమాశ్లేషము చేసినట్టిదని వేరే చెప్పనవసరము లేదు.

క్రీస్తు పూర్వము అనేక వేల సంవత్సరముల క్రితము ప్రాచీన ఋషి వాటికల గురుకులముల యందును, తక్షశిల, నలంద, వల్లభి, విక్రమశిల మున్నగు విశ్వ విద్యాలయముల యందును, మహావేత్తల చేత చతుర్వేదములు, షడంగములు, షడ్దర్శనములు, అష్టాదశ శిల్పములు, చతుష్షష్టి కళలు బోధింపబడుచుండెడివి. ఆ విద్యలందు చందోవ్యాకరణములు, గణిత జ్యోతిష్యములు, గీతానృత్యములు, పాశుపాల్యము, పంచాంగము, యుద్ధతంత్రము, వైద్యము, రసవాదము మున్నగునవెన్నియో గలవు.

ఈ విశ్వవిద్యాలయములందు వివిధ దేశాగతులైన విద్యార్థులు గూడ వ్యాసంగము చేయుచుండెడివారు. అశోకుని బౌద్ధమత ప్రచార ఫలితముగా బౌద్ధమతముతోబాటు భారతీయ సంస్కృతి బర్మా, సిలోన్, థాయ్‌లాండ్, కంబోడియా, చంపా, బలి, జావా, మలేసియా, చైనా, జపాన్, కొరియా దేశములకు వ్యాపించినది. ఇత్సింగు, పాహియాన్, హ్యూన్‌త్సాంగ్ మున్నగు చైనా యాత్రికులు యిచటకు వచ్చి మన విద్యలు నేర్చుకొని మన గ్రంథము లనేకము తోడ్కొని పోయిరి. ఆయా దేశములందీ నాటికిని పలు తావుల శివాలయములు బౌద్ధ స్థూపముల రూపమున శిథిలావ శేషములే గాక మనుష్యుల మనస్సులలో

ంగడలో మన సంస్కృతి జీవకళలు నిలచియున్నవి.

ఆధునిక యుగమున గూడ పాశ్చాత్యదేశము లందు వివేకానందుడు, ంద్రనాథ ఠాగూరు, గాంధీ మహాత్ముడు, పండిత నెహ్రూ, అరవిందుడు, పల్లి రాధాకృష్ణ, సి.వి. రామన్, "హరేకృష్ణ" ఉద్యమ ప్రవర్తకుడు భక్తి ంతస్వామి ప్రభుపాదుడు, మున్నగువారి వలన పాశ్చాత్య ప్రపంచమున తీయ సంస్కృతి ప్రతిష్ట లినుమడించి విశ్వమానవ సంస్కృతికి దోహదము నది.

# మాతృదేవోభవ

మనం గతాన్ని పరిశీలిస్తే, మనది మాతృస్వామ్య వ్యవస్థగా చరిత్ర
చెబుతుంది. ప్రకృతినే స్త్రీమూర్తిగా దేవతగా ఆరాధిస్తూ భావిస్తూ వస్తూ ఉన్నాం
ప్రాచీనకాలమున స్త్రీకున్న స్థానమును పరిశీలించినట్లైతే
"మాతృదేవోభవ" అను ఉపనిషత్తుల ఆదేశాలను - "యత్ర నార్యస్తు పూజ్యంతే
రమంతే తత్రదేవతాః" అను మను ధర్మశాస్త్రము నందలి నారీ సత్కారము
"జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అను రామాయణ ఇతిహాస
వచనము, ఈ విధంగా మన పురాణగ్రంథములలో స్త్రీకి ప్రాచీన యుగము
గల మర్యాదలను గూర్చి వివరించిన ప్రాధాన్యతలను మననం చేసుకుంటు
వుంటాం.

వాస్తవముగా పురుషుని కంటే స్త్రీకి సాంఘిక బాధ్యతలు అధికము
శిశువుకు జన్మనిచ్చినది మొదలు అనేక కష్టములను సహించి పోషించుచు
చివరకు ఒక సంస్కారవంతునిగనో, సంస్కారవంతురాలిగనో
రూపొందించుటలో నిరంతర కృషి చేయుచున్నది మాతృమూర్తియే. అందు
'అమ్మ' అనే పదము మనకు పవిత్రమైనది. మన పూర్వీకులు స్త్రీలకు ప్ర
పేరులో అమ్మ అనే పదమును జోడించి నామకరణం చేశారు. కాని నాగరి
ప్రపంచంలో అమ్మ అనే పదాన్ని ఉచ్చరించడం నాగరికతకు లోపంగా భావిస్తు
అర్థం లేని అనుకరణలకు పాల్పడుతున్నాం మనం. మన దేశాన్నే తల్లిగ
భారతమాతగా వ్యవహరించుకునే సంస్కృతి కల వ్యవస్థ మనది. మనకు
జన్మనిచ్చి పాలిచ్చి పోషించి నడక నేర్పి మాట నేర్పిన మాతృమూర్తి దైవంతో
సమానం.

అలాంటి మాతృమూర్తికి స్త్రీలోకానికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను నేటి
సమాజము ప్రసాదించాలి. ఎల్లవేళల స్త్రీ స్వేచ్ఛగా మనగలిగిననాడే మన

స్త్రీలను గౌరవించిన వాళ్లమవుతాం. మనలో అందరము శ్రీరాముడి లాంటివారమే కాని మాతలకు మాత్రము కష్టాలు తప్పడంలేదు. కారణం మనలో వున్న లోపభూయిష్ట విధానమా! మానసిక రుగ్మతా! అర్థం కావటం లేదు.

నేడు మనం అనుకరించే పాశ్చాత్య సంస్కృతిని, నాగరికతను చూస్తే భావితరాలు ఈ మాతృదేవోభవ అనే అర్థాన్ని మరుస్తాయా అనిపిస్తుంది. మన సంస్కృతిని, కట్టు, బొట్టు, ఆచారాలను పెడత్రోవ పట్టించే నాగరికతలను మనం విడనాడి మన సాంప్రదాయాలను కాపాడి భవిష్యత్తును పూలబాటగా చేసెడి మాతృదేవత తన కర్తవ్యాన్ని గుర్తించాలి, మంచిని పంచాలి, మమతను పెంచాలి.

'మా తాపృథివీ, పుత్రోహం పృథివ్యాః'

మన జీవితాలకు మూలాధారమైనది ఈ భూతలం. ప్రాణవాయువును, నీటిని, ఆహారాన్ని, మనుగడను ప్రసాదించే ఈ భూమిని తల్లిగా భావించమని ఉపనిషత్తులు బోధిస్తున్నాయంటే తల్లికి వున్న స్థానం గ్రహించవచ్చు.

# పితృ దేవోభవ

"మాతృదేవోభవ" లాగే "పితృదేవోభవ" అన్న సూక్తిని కూడా మనం నిరంతరం మననం చేయాలి.

జన్మనిచ్చిన తల్లితండ్రి ప్రత్యక్షదైవాలు. వీరి ఆశీస్సులు సర్వదా మనకు అవసరము. మాతాపితల ఆశీస్సులు ఎల్లప్పుడూ మనపై ఉండాలి. అందుకే దైవత్వాన్ని పొందిన ప్రత్యక్ష దేవతలుగా తల్లిని తండ్రిని విశ్వసిస్తున్నాం.

ప్రతి తండ్రి తన తనయుడు ఉత్తమ విద్యావంతుడు కావాలని సత్ప్రవర్తన కలిగి ఉన్నత శిఖరాలను అధిరోహించాలని, ఉత్కృష్ట స్థానాన్ని పొందాలని కోరుకుంటాడు, అహర్నిశలు కృషి చేస్తూ వుంటాడు.

జన్మను ప్రసాదించి తన సర్వస్వాన్ని పంచే తండ్రి దేవుడే మరి. అంతేకాకుండా ఈ దైవత్వం పారంపర్యంగా సంక్రమిస్తుంది. తండ్రిని దైవంగా తలంచి గౌరవించి పూజించిన తనయుడు తాను గూడ తండ్రి గాక తప్పదు. పితృస్థానాన్ని ఆక్రమించి ఔన్నత్యాన్ని పొందక తప్పదు. అందుకే ఈ భావన మానవాళిలో జీర్ణించుకొని సామాజిక దృక్పథాన్ని పెంచి చైతన్యవంతుల్ని చేస్తుంది. ఈ భావనే మనుష్యుల్ని నైతికంగా, సాంఘికంగా, భౌతికంగా తీర్చిదిద్దుతుంది.

అందుకే తల్లిదండ్రులు ఆరాధ్యదైవాలు. వారిని పూజించి, గౌరవించడం ద్వారానే మన నాగరికత పరిణతి చెందుతుంది.

కుటుంబ బాధ్యతను సంపూర్ణంగా నిర్వర్తిస్తూ సామాజికాభివృద్ధికి తను కుటుంబపరంగా బాధ్యత వహిస్తూ, సంఘశ్రేయస్సుకూడా తన ధర్మంగా భావించే పురుషుడు ఏ సమస్యనైనా విస్మరించడు.

దైవంతో సమానమైన తండ్రి ఎల్లప్పుడూ తన పిల్లల భవిష్యత్తును సుఖమయం చేయాలని కోరుకుంటాడు. కాని అది గ్రహించని కొందరు

తండ్రిని లక్ష్యపెట్టక పెడచెవిని పెట్టి అజ్ఞానులై కోపతాపాలకు పాల్పడి జీవితాన్ని దుర్భరం చేసుకుంటారు.

తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయచుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ!

కోపం వల్ల జీవితం దఃఖభాజన మవుతుంది. కోపాన్ని తగ్గిస్తే కోరికలు నెరవేరుతాయి. స్వర్గనరకాలు ఎక్కడో లేవు. తన కోపమే దుఃఖానికి కారణం - అది నరకం. తన శాంతమే సంతోషం - అదే స్వర్గం. వాటిని మానవుడు తనకు తానే కల్పించుకోవచ్చు. ఔన్నత్యమూ, ఔదార్యమూ గలవాడు ఎప్పుడూ గొప్పవాడే. యోగి వేమన కూడా కోపము గురించి వివరిస్తూ.....

కోపమునను ఘనత కొంచెమై పోవును
కోపమునను మిగుల గోడుజెందు
కోపమడిచె నేని కోరికలీడేరు
విశ్వదాభిరామ వినురవేమ.

కోపం మనిషికి మంచిది కాదని కోపం వల్ల కీడును వివరించాడు. అందుకే శాంతాన్ని ఆచరించమంటారు పెద్దలు. ఏ పని అయినా ఏకాగ్రతతో చిత్తశుద్ధితో చేయాలంటారు. మూర్ఖంగా ఏదీ చేయవద్దని ఆచారాలు, సంప్రదాయాలను కూడా గుడ్డిగా అనుసరించడం తగదంటాడు వేమన.

ఆత్మశుద్ధిలేని ఆచారమదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమ.

చిత్తశుద్ధిలేని పూజలు నిరుపయోగము. అందుకే దైవసమానమైన పితృమూర్తిని ఆత్మశుద్ధిగా చిత్తశుద్ధిగా గౌరవించి తరించాలి.

# ఆచార్యదేవోభవ

ఆచార్యదేవోభవ అన్నది ఆర్యోక్తి. దీని అర్థం గురువు దైవం వంటివాడని. గురువు లేదా ఉపాధ్యాయుడు ప్రత్యక్షదైవం లాంటివాడు. "మాతృదేవోభవ, పితృదేవోభవ, ఆచార్యదేవోభవ" అన్న ఆర్యోక్తిలో మానవుడు జన్మనిచ్చిన తల్లిదండ్రుల తర్వాత గౌరవించేది ఆచార్యుడినే. తల్లిదండ్రులు తనకు భౌతికంగా జన్మనిచ్చిన వారైతే గురువు తనకు జ్ఞానాన్ని ప్రసాదించి వెలుగును చూపించే మార్గదర్శి. మనలోని అజ్ఞానాంధకారాన్ని పారద్రోలి విజ్ఞానపు వెలుగుల్ని ప్రసరింపజేసేవాడు. అందుకే గురువు దైవంతో సమానం అంతేకాదు ప్రత్యక్ష దైవం.

ఒక దేశపు అభివృద్ధి - పుష్కలమైన ధనసంపదపై గాని, అభేద్యమైన దుర్గాలపై గాని ప్రభుత్వ భవనాల అందచందాలపై గాని ఆధారపడి వుండదు. ఆజాతిలోని మేధాసంపద, ఉన్నతవిద్య, శీలసంపదలపై ఆధారపడి వుంటుంది. అలాంటి వ్యక్తుల్ని తీర్చిదిద్దేది ఆచార్యులే. మానవ వనరుల అభివృద్ధే ఏదేశానికైనా అత్యంత అమూల్యమైన ఆస్తి. వ్యక్తి గుణగణాలు అభివృద్ధికి కొలబద్ద అయితే దానికి విద్య కేంద్ర బిందువుగా వుండాలి. ప్రజల్లో విద్యావ్యాప్తి విస్తృతంగా జరిగినప్పుడే వివేకం పెరుగుతుంది. మన ప్రజాస్వామ్యం, సామ్యవాదం, లౌకిక విలువలే గాక మన దేశ సార్వభౌమత్వం కూడా సార్వజనీన విద్యాసాధనపై ఆధారపడి వుంటుంది.

జనానికి తెలియని విషయాలను తెలియజెప్పుటయే విద్యగాదు. ఇలా ప్రవర్తించాలని నేర్పేదే విద్య. అక్షరాల ఒంపుసొంపులు, అంకెల గారడీలు నేర్పటం కాదు. వాళ్లు నేర్చుకున్న సంఖ్యాజ్ఞానం వంచన చేయటానికి ఉపయోగపడకూడదు.

అధికారిగా యుండటం కన్న, ఆచార్యునిగా ఉండటంలోని గౌరవాన్ని తెలిపేదే 'ఆచార్య దేవోభవ' అన్న ఆర్యోక్తి. అందుకే ఆర్యగ్రంథాల్లో

"గురుర్విష్ణో
గురుర్బ్రహ్మ, గురుర్దేవో పరమేశ్వరాః
గురుసాక్షాత్ పరబ్రహ్మ, తస్మై శ్రీగురవే నమః"

అని గురువుని సాక్షాత్ పరబ్రహ్మగా భావించి సత్కరించారు.

ఆచార్యుని వృత్తి పరమ పవిత్రమైనది. ప్రపంచ చరిత్రనే మార్చే నిగూఢమైన శక్తి ఆచార్యునిలో నిక్షిప్తమై వుంటుంది. కావున ఆచార్యుడు దేవునితో సమానము.



# మహాపురుషుల ప్రతిభ

శంకరాచార్యులు, రామానుజార్యులు, మధ్వాచార్యులు, రామకృష్ణ పరమహంస వంటి మహాపురుషులు ఎందరో జీవితంలో ఏదో ఒక క్రొత్త విషయాన్ని ఉపదేశించారు. ప్రజల జీవిత విధానంలో మార్పు తెచ్చారు. వారు స్వూర్యభగవానుని వలె దూరంగా వుండి ప్రకాశాన్ని వెదజల్లారు. మనకు సూర్యకిరణాల వల్ల ఆరోగ్యం లభిస్తుంది. శరీరంలోని ఏదో ఒక భాగం వాచిందనుకోండి. ఆ భాగానికి కాపడం పెట్టడానికి ఆ వేడి పనికిరాదు. కాపడం పెట్టడానికి అగ్ని కావాలి. శరీరానికి దగ్గరగా వచ్చి, మనకు సేవకుని వలె పరిచర్య చేయగలదు అగ్ని. సూర్యభగవానుడు మనకు గురువు కాగలుగుతాడు, కాని సేవకుడు మాత్రం కాలేడు. అతడు మనకు ప్రకాశాన్ని ప్రసాదిస్తాడు. ఆ ప్రకాశంలో మనం మన బుద్ధిని బట్టి పనులు చేసుకోవాలి. సూర్యుడు లేకపోతే అగ్నిలో ఉండే శక్తి గూడా అంతంత మాత్రమే నన్న సంగతీ సత్యమే. అలాగే మన నిజ జీవితంలోను అంతే. ఒక్కొక్కరి ప్రభావం ఒక్కో విధంగా మనల్ని ప్రభావితం చేస్తుంది.

ఆధ్యాత్మిక ప్రతిభ హృదయానికి సంబంధించినది. అందుచేత ఒక మహాపురుషుణ్ణి మరో మహాపురుషునితో పోల్చడానికి వీలులేదు. ఎవరు గొప్ప? ఎవరు తక్కువ? అని ఆలోచించడమువలన ఎటువంటి అర్థమూ, ప్రయోజనమూ లేదు. ప్రతివారిది ఒక విలక్షణమైన విశిష్టమైన ప్రతిభ. కేవలం వారి వారి విలక్షణ ప్రతిభను గురించి మాత్రమే మనం చెప్పుకోవాలి.

మహాపురుషులందరూ కరుణామయులు వాత్సల్యభావ ప్రేరితులు. వారిలో జ్ఞానము అంతర్నిహితమై ఉంటుంది. కరుణ వెల్లివిరుస్తుంది. గాంధీగారు యిలాంటి మహాపురుషుడే, కారుణ్య వాత్సల్యభావప్రేరితు లైనవారు చివరిదాకా ప్రజల సేవ చేస్తూనేవున్నారు. ప్రతివాడూ ఆయన తనవాడే

అనుకునేవాడు. ఒకరికి కడుపులో నొప్పి వస్తే గాంధీగారు దానికి వైద్యం చెప్పేవారు. దంపతులలో తగాదా వస్తే వాళ్లూ సలహా పొందడానికి గాంధీగారి వద్దకు వచ్చేవారు. అత్యవసరమైన ముఖ్యమైన పనులలో మునిగి తేలుతూ కూడ గాంధీగారు యిలాంటి చిన్న చిన్న విషయాలను కూడ పట్టించుకునేవారట. ప్రతిపని చిత్తశుద్ధితో చేసేవారు గాంధీజీ..

చిత్తశుద్ధి కలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు కొదువగాదు
విత్తనంబు మర్రి వృక్షంబునకు నెంత
విశ్వదాభిరామ వినురవేమ.

తాము ప్రబోధించే సంస్కారం చాల పుణ్యమైనది. దీనిని చిత్తశుద్ధితో చేస్తే సిద్ధించే ఫలితం ఎంత చిన్నదైనా అదేం తక్కువ పని కాదు. చూడ్డానికి మర్రి విత్తనం ఎంతో చిన్నది. సారవంతమైన భూమిలో దీనిని నాటితే, అది మొలకెత్తి మహావృక్షంగా రూపొందుతుంది. ఊడలు దింపి ఎన్ని వందల సంవత్సరాలో నీడనిస్తుంది.

అహింస అనే ఆయుధం చాల చిన్నది. అయితే చిత్తశుద్ధితో చేసిన కృషివల్ల అది మనకు స్వాతంత్ర్యాన్ని సంపాదించిపెట్టింది.

అహింస లాంటి ఆయుధమే మనిషి నోటినుండి వచ్చే మాట అయితే ఈ మాట ఎవరి నోటినుండి వచ్చింది అన్నది ప్రధానాంశము గాదు. మాటకి క్రియారూపము యిచ్చినప్పుడే ఆ మాటకు శక్తి వస్తుంది. మహాత్ములందరు మనలాంటి మానవులే. అయితే వారి మాటలు ఎప్పటికీ మనము పాటిస్తున్నామంటే అవి ఎంత శక్తివంతమైనవో మనము గమనించాలి. మన మాటలే మనకు శత్రువులను, మిత్రులను సమకూరుస్తాయి. అందుకే అంటారు పెద్దలు -

"నోరు మంచిదయితే ఊరు మంచి
దవుతుందని" - కాదంటారా!

# "గాంధీజీ దృష్టిలో - స్త్రీశక్తి"

వేదకాలములో అరుంధతి స్త్రీజాతి గౌరవానికి చిహ్నంగా ఉండేది. ఆమె మహిమ ఇంతింత కాదు, ఆమెను పొంది వసిష్ఠ మహర్షి తాను పునీతుడయినట్లు భావించే వాడు. "యయా పూతం మన్యే" ఆమెను జనకుడు ఉషాదేవితో పోల్చి నమస్కరించెను. మైత్రేయి యోగ్యత ఏమిటో తెలిపినది. బృహదారణ్యకోపనిషత్తు, యోగవాసిష్ఠంలో స్త్రీ ఎంతో భవ్యం ఉదాత్తం పావనం ఉద్ధారకంగా వర్ణింపబడింది.

పౌరాణిక సాహిత్యం సీత సావిత్రి దమయంతి శకుంతల ద్రౌపది మొదలగువారి పవిత్రతత చతురత తేజస్సు జ్ఞాపకములను గూర్చి వేనోళ్ల పొగిడింది. ఇక చారిత్రక సాహిత్యంలో మీరాబాయి పద్మిని ముక్తాబాయి అహల్యాబాయి - వీరి పేర్లు ప్రాతః స్మరణీయాలుగా చెప్పబడ్డవి.

స్త్రీ అబల అని మొదట ఎవరన్నారో తెలియదు. త్యాగం నమ్రత శ్రద్ధ వివేకం స్వేచ్ఛాపూర్వకమగు కష్టసహనం ఆమెలో మూర్తీభవించి యున్నాయి. కాని ఇన్ని గుణాలు నాలో ఉన్నాయని ఆమె చెప్పుకుంటూ తిరగదు.

పశుబలమే నిజమైన బలమని మనం అంటే, అలాంటి బలం పురుషుని కంటె స్త్రీలో తక్కువని చెప్పక తప్పదు. బలమంటే నైతికబలమే అని అంటే, అది పురుషునిలో కంటె స్త్రీలోనే అధికం. స్త్రీలో ఉన్న నైతికశక్తిని కొలమానంలో చెప్పలేము. అహింస మానవ జాతికి మూలధర్మమైతే భవిష్యత్తులో మానవజాతి గౌరవం స్త్రీజాతిలోనే ఉంది. స్త్రీపురుషులిరువురికీ సమాన అవకాశాలు లభిస్తే ఇరువురుమ పరస్పర సహకారంతో ఎంతో ముందుకు సాగిపోగలరు.

దేశ సార్వజనిక జీవనంలో గాంధీజీ ప్రవేశించకపూర్వం స్త్రీశక్తి అంతా సుసుప్తావస్థలో ఉండేది. గృహలక్ష్మిగాను మాతృరూపిణిగాను ఆమె కుటుంబ జీవితాన్ని ప్రకాశింపజేస్తూ, దానిని మంగళకరం చేస్తున్నప్పటికి ఆమెలో వున్న లోకకళ్యాణ శక్తులు ప్రకటితం కావడానికి అవకాశం లభించలేదు. ఈపని

గాంధిజీ యొక్క దేశసేవా కార్యకలాపాల ద్వారా సాధ్యమయింది. దేశస్వాతంత్ర్య సంగ్రామానికి ఆయన యిచ్చిన అపూర్వమైన పిలుపు కారణంగా, అసంఖ్యాకులగు నారీమణులు ఘోషాపద్ధతి విడచి అంతఃపురాల నుండి బయటికి వచ్చారు. స్వాతంత్ర్య యజ్ఞంలో వారు తమ హవిర్భాగాన్ని సమర్పించడములో పోటీపడ్డారు. కొన్నిచోట్ల వారు పురుషులను కూడా మించి పని చేశారు. సారాయి దుకాణాల ముందు, విదేశీ వస్త్రశాలల ముందు పికెటింగ్‌లో వారితో సరితూగిన వారెవరు అని ప్రశ్నించుకోవచ్చును.

ప్రపంచములో ఇతర దేశాల్లో పురుషులతో సమానమగు ఓటు హక్కు సంపాదించుకొనుటకు స్త్రీలు ఎంతోకాలం వేచి యుండవలసివచ్చింది. కాని భారతదేశంలో స్వాతంత్ర్యప్రాప్తితో పాటు సహజంగాను సత్వరంగాను స్త్రీకి కూడ ఓటుహక్కు వచ్చింది.

స్వాతంత్ర్య సంగ్రామకాలములో ఎక్కడికక్కడ ఎందరెందరో స్త్రీలు పాల్గొన్నారు. భారతదేశంలో ఇప్పుడు అనేక ప్రాంతాలలో తమ అభిరుచులను బట్టి సార్వజనిక సేవలలో పాల్గొనుచున్న స్త్రీలు అసంఖ్యాకులు.

తాతతండ్రుల కాలంలో ఎలా వున్నా తన కాలంలో తల్లికి మొదటి పీట వెయ్యమన్నారు పెద్దలు.

తల్లినెరుగువాడు దైవంబునెరుగును<br>
మన్నునెరుగువాడు మిన్నునెరుగు<br>
మిన్ను మన్నెరిగిన తన్ను తానెరుగును<br>
విశ్వదాభిరామ వినురవేమ.

తనకు తన ప్రపంచానికి ఉత్పత్తి స్థానమైన తల్లిని తెలుసుకుంటే దైవాన్ని తెలుసుకున్నట్లే. తన ఇహానికి కారణభూతమైన ఈ లోకాన్ని తెలుసుకుంటే పరానికి ఆధారమైన ఆకాశం అర్థమవుతుంది. తన ఇహపరాలను అవగాహన చేసుకున్న వాడికే ఆత్మజ్ఞానం అలవడుతుంది. నవమాసాలు మోసి, కని పెంచిన తల్లిని దేవతగా పూజించాలి, స్త్రీశక్తిని గ్రహించాలి.



# చారిత్రక పరిణామంలో ఆచారాలు -

# స్త్రీమూర్తి

ఆటవిక సమాజం నుంచి నాగరిక సమాజం ఉద్భవించింది. సంఘ జీవితంలో ఒక్కొక్క మార్పు ఒక కొత్త పరిణామానికి దారి తీసింది. ఈ మార్పులన్నీ రావటానికి కొన్ని వందల వేల సంవత్సరాలు పట్టిందంటే మన ఆశ్చర్య పోనవసరం లేదు. ఇప్పుడున్న మాదిరి కుటుంబ వ్యవస్థ ఆనాడు లేదు ఈ చుట్టరికాలు ఈ వావివరుసలు ఈ సంబంధాలు ఆనాడు లేవు. ఆటవి సమాజంలో స్త్రీపురుష సంబంధాలు ఏయే దశలో ఎలాటి మార్పులన పొందాయో తెలుసుకుంటే కాని ఆటవిక సమాజం నుంచి ఆధునిక సమాజ ఎలా ఏర్పడిందో దాని చారిత్రక పరిణామక్రమం మనకు సరిగా బోధపడదు ఇప్పుడు మన నరనరాల్లో జీర్ణించిన నమ్మకం, ఆచారాలు, అలవాట్లు పరిశీలి వీటికి కొన్ని వేల సంవత్సరాల చరిత్ర వుందంటే మనం ఆశ్చర్యపోక తప్పదు.

రావిచెట్టుకీ - వేపచెట్టుకీ మనం పెళ్లిళ్లు చేస్తాము నాగుల చవితినాడ పుట్టలోపాలు పోస్తాము. సంక్రాంతికి కనుము పండుగనాడు ఆవులకు పూ చేసి నాగళ్లను శుభ్రం చేసి పసుపు రాసి ఎడ్లను అలంకరించి పండు చేసుకుంటాం - స్త్రీలు శ్రావణమాసంలో గౌరీదేవి నోము నోస్తారు ప్రతిగ్రామంలోనూ గ్రామదేవతలకు జాతరలు జరిపి పశువులను బలి యిస్తు వుంటారు. ఇలాటి సవాలక్ష ఆచారాలు సంప్రదాయాలు పండుగలు వగైరాల మనం జరుపుతాము - ఇవన్నీ మన నిత్యజీవితంలో ఎంతో ప్రముఖ పాత్ర వహిస్తున్నాయి.

ఆటవిక సమాజంలో స్త్రీలకు ఎటువంటి స్థానం వుండేది? వా హక్కులేమిటి? వారికున్న అధికారాలేమిటి? ఆ రోజుల్లో స్త్రీలు ఏయే పనుల

చేసి ఎలా జీవించెడి వారు అనే విషయాన్ని పరిశీలిస్తే..ఒకప్పుడు వున్న మాతృస్వామిక వ్యవస్థ గురించి మనం ముఖ్యంగా తెలుసుకోవాలి.

ప్రకృతి అనగా స్త్రీ - స్త్రీ నుంచే ఈ సృష్టి అంతా ఏర్పడింది. సాంఖ్య తంత్రశాస్త్రాలు స్త్రీ రూపంలో వున్న ప్రకృతిని ఆరాధిస్తాయి. సృష్టికి స్త్రీ మూలమనే ప్రకృతివాదం సహజమై స్త్రీ ఆధిక్యతను స్పష్టంగా సూచించే ఈ భావం ఒక చిన్న తాత్విక విలాసం మాత్రమే.

స్త్రీలు వ్యవసాయాన్ని కనిపెట్టారు. వారు మొదట పండించింది యవలు. ఆదిమ ఆటవిక సమాజంలో తొలుత వ్యవసాయం చేసి పంటలను పండించినది సంపదను సృష్టించినది స్త్రీలే. ఈ కారణంచేత సాంఘికంగా స్త్రీలకు ఆధిక్యత వచ్చింది. భారతీయ ఆధ్యాత్మిక చింతన పరంగా కూడా స్త్రీకి మాతృమూర్తిగా గౌరవం వుంది. భౌతిక సంపదకు మూలమైన వ్యవసాయ పరిశ్రమను స్త్రీలే నిర్వహించటం వలన స్త్రీ పురుషుని కంటె అధికురాలనీ, ఆమె సృష్టికి మూలకారణమని గుర్తించారు.

వైదికమతం పురుష ప్రధానమైనది. వేదకాలంనాటి ఆర్యులకు వ్యవసాయం తెలియదు. వారు పశుపోషకులు పశువులే వారి సంపద. ఆటవిక సమాజంలో వ్యవసాయాన్ని కనిపెట్టి కొత్త సంపదను సృష్టించింది స్త్రీలు.

"కార్యేషుదాసీ, కరణేషు మంత్రి
భోజ్యేషు మాతా శయనేషు రంభా
రూపేచలక్ష్మీ, క్షమయా ధరిత్రీ
షట్కర్మ యుక్తా, కులధర్మపత్నీ".

అని మన పెద్దలు ఏనాడో స్త్రీ ఔన్నత్యాన్ని నొక్కి వక్కాణించారు. ఇది కలియుగం. ఈనాటి స్త్రీధర్మాలను ఆనాటి స్త్రీ ధర్మాలతో పోల్చి చూస్తే హస్తిమశకాంతరం కనిపిస్తుంది. నేటి స్త్రీలు అనుసరించే పద్ధతులను గురించి వివరించడం ముంజేతి కంకణాన్ని అద్దంలో చూపడమవుతుందేమో!

నేడు స్త్రీలు విద్యావైజ్ఞానిక రంగాలలో ఎంతో ముందంజలో వున్నారు. ఈ పరుగుపందాల జీవన విధానంలో స్త్రీలు పురుషులతో సమానంగా పయనిస్తున్నారు. కాని ఈ మేధస్సు సభ్యతను సంస్కారాన్ని నలిపివేసి నడివీధుల్లో స్వేచ్ఛామార్గాన్ని అనుసరించకూడదు - విజ్ఞానం సమాజ శ్రేయస్సుకు దోహదపడాలి.

స్త్రీ గౌరవాన్ని పెంచుకోవాలి.
సమాజం మాతృప్రేమను పంచుకోవాలి.

# ఆలుమగలు

ప్రకృతిని స్త్రీమూర్తిగా ఆరాధిస్తాం. ప్రకృతి అనుకూలిస్తే ఆనందమయం. ఆగ్రహిస్తే ఆందోళన ఆక్రందన బీభత్సాలు ప్రళయాలే మిగులుతాయి.

ఆవిధంగానే స్త్రీకూడా కరుణామయి కావాలి, ప్రేమమయం కావాలి, అప్పుడే ప్రతి కుటుంబం ఆనందమయం అనురాగ భరితం అవుతుంది.

"గుణవతియగు గృహము చక్కగనుండు
చీకటింట దివ్వె చెలగు రీతి
దేవియున్న గృహము దేవార్చన గృహంబు
విశ్వదాభిరామ వినురవేమ"

అన్నాడు వేమన.

అనుకూలవతియైన భార్య భర్తకు ఎంతో మనోధైర్యాన్ని సమకూరుస్తుంది. ఆ సంసారం సుఖమయమవుతుంది. ఆ యిల్లు దేవాలయం లాగా కళకళలాడుతూ పవిత్రంగా వుంటుంది. భార్య గుణవతి రూపవతి కావాలని ప్రతివారు కోరుకుంటారు. "కార్యేషు దాసి.....శయనేషు రంభ" అని పెద్దలు చెప్పారు. అందుకే భార్య అర్థాంగి అన్నారు. ఆమె ప్రోత్సాహముతో అతడు ఎన్నో కార్యాలు సాధిస్తాడు విజయాలు పొందుతాడు. వివేకవంతురాలైన స్త్రీ భర్త భవిష్యత్తుకే బాట వేస్తుంది. దాంపత్యం అనుకూలమై ఆనంద భరితమవుతుంది. భర్త మాట లెక్కచేయక గౌరవించక నరకాన్ని సృష్టించే స్త్రీల వలన ఎన్నో అనర్థాలు ఉత్పన్నమవుతాయి ఆందోళనలు చెలరేగుతాయి. సంసారం ఈదలేని సాగరమవుతుంది. ఈ విషయాన్ని కూడా వేమన వేదాంత దృష్టితో పరిశీలించి....

"ఆలు మగని మాట కడ్డము వచ్చెనా
ఆలుగాదది మరగాలు గాని

అట్టి ఆలు విడచి యడవి నుండుట మేలు
విశ్వదాభిరామ వినురవేమ"
ని అన్నాడు.

పరస్పర అవగాహన లోపిస్తే కుటుంబం భయంకరంగా మారుతుంది. నేక అనుమానాలకు దారితీస్తుంది. చీటికి మాటికి ప్రతిమాటకు యిరువురు రిశీలనాత్మకంగా పరిశోధనాత్మకంగా తప్పులను ఎన్నుకుంటూ వుంటారు. ప్పుల చిట్టా తయారుచేసి ద్వేషాలు పెంచుకుంటారు. వైషమ్యాలు రుగుతాయి పొదుపు కరువవుతుంది. ఆరోగ్యం దెబ్బ తింటుంది, పంతాలు ట్టింపులు పెరుగుతాయి. సోమరితనం చోటుచేసుకుని సంస్కారం ోపిస్తుంది. మానసిక ఆందోళన పెరుగుతుంది.

ఈ లోపాలు గ్రహించిన పరులు యిరుగు పొరుగులు చోటు ేసుకుంటారు. అగ్నికి ఆజ్యం పోసేవాళ్లు కూడా అవకాశాన్ని చూపి పయోగించుకుంటారు. సంసారాన్ని చిచ్చుబుడ్డిని చేసి ఆ వెలుగులో నందించేవారు కూడా వుంటారు. అలా జరుగుకూడదన్నట్లు మహానుభావుడు ేమన మరోమాట అన్నాడు.

పతియొప్పిన సతి యొప్పును
పతిసతు లొక్కటైన పరమ పావనమందున్
సతిపతి న్యాయమె మోక్షం
బతులిత పరమాత్మ నైక్యమగురావేమా.

అందుకే ఆలుమగలు అన్యోన్యంగా ఉంటూ సంసారాన్ని గడిపినప్పుడే వారి జీవితాలు ఆనందమయం.

# దాతకు కోపం తెప్పించకూడదు

సృష్టిలో మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనది. మేధస్సు కలిగిన మానవునికి స్పందించే శక్తి వుంది కాబట్టే క్రోధము ద్వేషముతో బాటు క్షమ దయ దాతృత్వం ప్రాప్తించాయి.

"అమ్మా ఆకలి ఓ ముద్ద దానం చెయ్యమ్మా" అంటే ఆకలి బాధ దానం తెలియని తల్లులుండరు. దాతృత్వం ఎరిగిన కర్ణుడు దానంలో జీవితాన్నే త్యాగం చేశాడు. మరణించే సమయంలో కూడ బంగారప్పన్ను దానం చేసి కీర్తివంతుడయ్యాడు. వామనుడి కోరికలు శిబి చక్రవర్తి దానప్రవృత్తి నలచక్రవర్తి నడవడి సత్యహరిశ్చంద్రుని దానధర్మ దీక్ష గురించి చరిత్ర చెపుతూనేవుంది.

దేవుడిని పూజిస్తాం ఆరాధిస్తాం మన కోరికలు నెరవేర్చమని వేడుకుంటాం - అలాగే దెయ్యమంటే భయపడతాం పారద్రోలడానికి ప్రయత్నిస్తాం, ఈ నేపథ్యంలో పుణ్యం పాపం మానవ జీవితాలలో మిళితమై సాంఘికంగా మానవులను క్రమశిక్షణతో నడుపుతూ వున్నాయని చెప్పవచ్చు.

దానం ధర్మగుణం మానవుని ఔన్నత్యాన్ని తెలుపుతూ పుణ్యం సమకూర్చుతూ వుంటాయని పురాణాలు చెపుతూ వున్నాయి.

భూమిలోన పుణ్యపురుషులు లేకున్న
జగములేల నిల్చు పొగులు గాక
అంత తరచు దొరక రాడనాడను గాని
విశ్వదాభిరామ వినురవేమ.

ఏ వ్యవస్థలోని వారైనా అందరు ధూర్తులే పాపులే అని నిర్ణయానికి రావడం తొందరపాటే అవుతుంది. అక్కడక్కడ ద్వీపాల్లాగ సజ్జనులుంటారు అన్నాడు వేమన. పుణ్య కార్యాలను తలపెట్టి, ధర్మాన్ని విడనాడక దానం చేసే దాతలను సమాజం ఉపయోగించుకోవాలి గాని వేధించి విసుగు పుట్టించి దుష్ఫలితాలను పొందకూడదు.

ందువులకు గోమాత ఎంతో పవిత్రమైనది. తన శ్రమను మనకు చుతూవుంది. పాలిచ్చి మనల్ని పెంచుతూవుంది - పాలుతాగి ఊపిరి ుకుంటున్నాం మనం. గోవు చెంత ఎన్ని పాలున్నాయో అంతవరకే డుకోవాలి కానీ మితిమీరితే పాలకు బదులు రక్తమొస్తుందన్న సత్యాన్ని రువకూడదు. దాతకు విసుగు కోపం తెప్పించడం వల్ల చెడు ఫలితాలే స్తాయి గానీ మంచిని పొందలేము.

మహాభారతమున అమృతము కొరకు సముద్రమును మధించిన కథ న్నది. దేవతలు రాక్షసులు కలిసి సముద్రమును మధించారు. సముద్రము రికి "ఉచ్ఛ్చైఃశ్రవస" అను అశ్వమును ఒసంగినది. రత్నముల నిచ్చినది, క్ష్మీదేవిని ప్రసాదించినది. అయినా వారు సముద్రమును మధించుట ానుకోలేదు. సముద్రునకు కోపం కలిగి ఆ కోపంతో హాలహల విషమును కి తెప్పించి ముల్లోకములను మండింపజేశాడు. అందుకే దాతకు కోపమును ప్పించనంత వరకే మనమొకరిని యాచించదగును అనే విషయాన్ని హించాలి.

దాతలతో పాటు ఈ లోకంలో పిసినారులను కూడా మనం చూస్తూనే న్నాం.

ధనము కూడబెట్టి ధర్మంబు సేయక
తాను తినక లెస్స దాచుగాక
తేనెటీగ గూర్చి తెరువరి కియ్యదా
విశ్వదాభిరామ వినురవేమ.

ధనాన్ని నలుగురికి పంచగలిగిన దాతృత్వమే ఉంటే ఆ ధనం ఒక్కడి గ్గరే ఎందుకు మూలుగుతుంది? ఎదుటివాడి కష్టసుఖాలను విచారించగలిగే ానవత్వమే వుంటే వారు అపమార్గాలలో ఎందుకు సంపాదిస్తారు. ధనం పిచ్చి ట్టినవాడు తాను తినడు ఒకరికి పెట్టడు.

"రాజుల సొమ్ము రాళ్లపాలు" అన్నట్లు చివరికి వారసుడు కూడ లేక చ్చిపోతారు. పువ్వుపువ్వుని పీల్చి తేనెటీగ తేనెను కూర్చితే వాటిని తరిమికొట్టి బాటసారులో తీసుకుంటారు - అలాగే మరోమాట సెలవిచ్చాడు వేమన.

"ఇంటిలోని ధనము ఇదినాది యనుచును
మంటి లోన దాచు మంకుజీవి
కొంచబోడు వెంట గుల్లకాసైనను
విశ్వదాభిరామ వినురవేమ"

కూడబెట్టిన డబ్బు మట్టిలో దాచినవాడు చివరికి మట్టిల కలిసిపోతాడు. ఆ డబ్బు ఎవరికీ చెందదు. బతికివున్నప్పుడు నలుగు పనికివచ్చే పని చేయని వాడు మంకుజీవి అంటాడు వేమన.

భిన్న మనస్తత్వాలు వ్యక్తిత్వాలు కలిగియున్న ఈ సమాజంలో - ధర దానం చేసే స్వభావం కలిగి ఉదాత్తగుణం కలిగిన దాతలను ఉత్త పురుషులుగా భావించాలి.

అలాంటి "దాతకు కోపం తెప్పించకూడదు" అని వేదాంతు చరిత్రలు మనకు చెప్తూ ఉన్నాయి.

# పరోపకారము

మానవ జన్మ ఎంతో ఉత్కృష్టమైనది. మేధాసంపత్తి కలిగిన మానవుడు తన మనుగడకు ఔన్నత్యానికి సహాయసహకారములు పొందాలి అందించాలి. అభివృద్ధిని కాంక్షించేవారు నిర్మల మనస్కులై దయదాతృత్వం కలిగి సమన్వయం కోరుతారు.

ఉపకరించడం సహకరించడం వంటి లక్షణాలు మానవుణ్ణి ఉన్నత శిఖరాలకు చేరుస్తాయి, సత్ఫలితాలను సమకూరుస్తాయి. బంతిని గోడకు కొడితే అదే వేగంతో తిరిగి వస్తుందన్న విషయం ప్రతి ఒక్కరికి తెలిసిందే. అదే విధంగా పరోపకారం కూడ మనపై ప్రభావం చూపుతుంది. మనకు మనోధైర్యాన్ని శక్తిని సమకూరుస్తుంది.

సంఘటిత శక్తితో మానవుడు దేన్నైనా సాధించగలడు అన్న విషయం మహాత్మాగాంధి మనకు నిరూపించి చూపారు. పట్టుదల కార్యదీక్ష మాత్రమే మనకు స్వాతంత్ర్యం తెచ్చిపెట్టలేదు. దేశప్రజల సమైక్యత సంఘటిత శక్తి మహాత్ముడి వెనక వున్నాయి. మహాత్మునిలోని గొప్ప శక్తి ఏమిటంటే, ఆయన అపకారికి కూడ హాని తలపెట్టని గొప్ప మనసు.

యోగి వేమన ఆనాడే మనకు ఒక సందేశాన్ని ఇచ్చారు.

చంపదగినయట్టి శత్రువు తనచేత
చిక్కెనేని కీడు సేయరాదు
పొసగమేలు చేసి పొమ్మనుటే చాలు
విశ్వదాభిరామ వినురవేమ.

చంపడానికి తగినంత కారణముండి చంపదగినవాడే నీ చేతికి చిక్కితే - ఏం చెయ్యాలి? చంపమన్నారు వేమన, కాని యెట్లా? వాడికేదైనా సహాయం చేసి భద్రంగా పంపాలి అదే వాడికి చావు.

అన్నివేళల కాదు గాని కొన్నిసార్లు క్రూరుడికి మేలు చేయడమే శిక్ష,

ఇంతటి ఉన్నత ధర్మాన్ని ఏ మతాలు బోధించాయి? వేమన సుతిమె హృదయానికీ క్షమ గుణానికి ఈ పద్యం పరాకాష్ట. అంతేకాక సంఘంలో ద్వే పనికిరాదంటాడు. చంపవలసింది శత్రువును కాదు శత్రుత్వాన్ని. దా చంపటానికి మేలు చేయడమే మార్గం. చంపదగిన వాడికి ప్రాణదానం కాను ఇవ్వడమే శిక్ష అంటాడు వేమన.

ఇంత గొప్పశక్తిని సమకూర్చుకునే అవకాశమున్న మానవుడు జీవిత కాలాన్ని వృథా చేయక ఉజ్వల భవిష్యత్తుకు మానవ కళ్యాణానికి న పలకాలి.

చిత్తశుద్ధి కలిగి తలపెట్టిన ప్రతికార్యము మనం తప్పక సాధిస్తాం.

చిత్తశుద్ధి కలిగి చేసిన పుణ్యంబు
కొంచెమైన నదియు కొదువగాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత?
విశ్వదాభిరామ వినురవేమ.

వేమన్న ప్రభోదాలు చైతన్యగోళాలై జ్వలించటానికి ఆం వ్యక్తిత్వంలోని అంతఃశక్తులే కారణం. దండలో దారంగా, వేమన భావ అంతర్లీనమైన సద్గుణాలు చిత్తశుద్ధి, సాహసం.

చిత్తశుద్ధి ఆయన తత్వానికి ఊపిరి. నలుగురికి ఉపయోగపడే చేయటమే పుణ్యం. ఇతరులను పీడించడం పాపం. ఎంత చిన్న మే హృదయపూర్వకంగా చేస్తే అది కొండంత అభిమానాన్ని సంపాదిస్తుంది.

మఱ్ఱి విత్తనం ఎంతో చిన్నది అయినా దాని స్వభా శాఖోపశాఖలుగా విస్తరించిన మఱ్ఱి వృక్ష స్వరూపాన్ని గుర్తు చేసుకు తెలుస్తుంది. ఉపకారము ఊరకనే పోదు. మనలోని మహోన్నత భావానికి ఉ స్వభావానికి ఔన్నత్యానికి ప్రతిరూపమై నిలుస్తుంది.

ஐ

# అతిథి దేవోభవ

సత్సాంప్రదాయము ఉత్తమ సంస్కృతి, నీతినియమాలకు ఆలవాల మయింది మన సమాజం. ప్రతివారు క్షమ ఓర్పు దయార్ద్ర హృదయం కలిగి వుండాలని అడుగడుగునా బోధిస్తూ వుంది మన సంప్రదాయం.

పెద్దలను విజ్ఞులను సర్వదా గౌరవించే గుణగణాలు మన రక్తంలోనే రంగరించుకుని ఉన్నాయి. అతిథి అభ్యాగతులను దైవసమానులుగా సేవించెడి తత్త్వం పూర్వం నుండి మనలో జీర్ణించుకుని వుంది. ఆతిథ్యం గురించి మను చరిత్రలో -

వండ నలయదు వేవురు వచ్చెనేని
నన్నపూర్ణకు నుద్దియౌ నతని గృహిణి
యతిథులే తెర నడికి రేయైన బెట్టు
వలయు భోజనంబు వింట నవ్వారిగాఁగ.

అన్నపూర్ణాదేవి వలె వేయిమంది యతిథులన్నార్తులై అర్ధరాత్రి వచ్చినను, వంట చేయుటకు విసుగులేక కావలసిన భోజన వసతులను యేర్పాటు చేసి తృప్తి కలుగునట్లు వడ్డించెడిదట ప్రవరుడి భార్య.

ప్రవరుడు భూమి యందుగల సకల పుణ్యతీర్థములను చూడవలెనను కోరిక గలవాడగుటచే - తీర్థయాత్రలు చేసి వచ్చుచున్న వారి వార్త వినగానే వారికి యెదురుగా వెళ్లి వారి పాదాలకు మ్రొక్కి తన యింటికి తీసికొని వచ్చి భక్తితో అతిథిపూజ చేసెడివాడట. వారికి యిష్టమైన భోజనము పెట్టి తృప్తి పరచి వారు సుఖముగా కూర్చున్న తర్వాత సమీపించి ఈ భూమిపై వున్న సముద్ర నదీ క్షేత్రముల ప్రభావములను వేరువేరుగా అడిగి అవి తానుండు చోటుకి ఎంత దూరమో వివరముగా తెలుసుకునెడి వాడట.

ఈ విధముగా అభ్యాగతులకు సమస్త ఉపచారములు చేస్తూ వున్న బ్రాహ్మణ పుత్రుడైన ప్రవరుని చెంతకు ఒకనాటి మధ్యాహ్న కాలమందు

కాషాయి రంగు చొక్కా ధరించి ఒక సిద్ధుడు వచ్చాడు. తలకు పులితో
చేయబడిన కుళ్ళాయి ధరించి పంచలోహములు కరిగించి చేసిన చేతికడి
వేసుకుని చంకలో సంచితో యోగదండము ఆడులేడి తోలుతో
నడుముకట్టు యోగపట్టము దాల్చి ఇత్తడివలె మాసిన పసుపురంగు
దేహమందంతటను విభూతి పూసుకొని, చెవుల యందు రుద్రాక్ష పో
దాల్చి జలమున్న కమండలము చేతబట్టుకొని, యోషధుల ప్రయోగము తె
సిద్ధపురుషుడు అతిథిగా విచ్చేసినాడట.

ఆ యోగీశ్వరుని చూసిన ప్రవరుడు భక్తితో నెదురుగా
నమస్కరించి, యర్ఘ్య పాద్యములచే పూజించి ఆ యోగికి ఎలాంటి ఆహా
యిష్టమో అలాంటి పరిశుద్ధమైన ఆహారమును పెట్టి -

ఎందుండి యెందు బోవుచు
నిందులకే తెంచినారలిప్పుడు? విద్య
ద్వందిత! నేడుగదామ
న్మందిరము పవిత్రమయ్యె మాన్యుడనైతిన్.

ఓ యోగీంద్రా! మీరు ఎక్కడనుండి యెక్కడికి బోవుచు యిక్క
వచ్చినారు? యోగ్యులైన మీ రాకచేత మా యిల్లు పావనమైనది. మీ దర్శ
చేత నేను పుణ్యుడనైతిని.

మీ మాటలు మంత్రంబులు
మీమెట్టిన యెడ ప్రయాగ మీపాద పవి
త్రామలతోయముల లఘు
ద్యోమార్గ ఝురాంబు పౌనరుక్తనములుర్విన్.

భూమియందు మీరు చెప్పెడి మాటలు వేదమంత్రము
పవిత్రమైనవి. మీరు తొక్కిన స్థలము ప్రయాగ క్షేత్రము వంటింది.
పాదములు సోకుటచే పావనములైన జలములు ఆకాశగంగ యొ
ఉదకములు - అని ప్రవరుడు సిద్ధుని యొక్క గొప్పతనమ
కొనియాడినాడు.

అందువలన "అభ్యాగతః స్వయం విష్ణు" అను
స్వయమాగతుడైన సిద్ధుని యందు విష్ణుత్వమును ధృడపరచుచున్నది.

యోగీంద్రా! మీవంటి పూజ్యులెవరి యింట గలసిమెలసి చుట్టములవలె స్నానము భోజనము పానము చేసి తృప్తి చెందిపోవుచుందురో ఆ గృహస్థుడే అదృష్టవంతుడు ధన్యజీవి యగును. ఆ గృహమేధిదే సార్థక జన్మము - అని మనస్ఫూర్తిగా ప్రవరుడు సిద్ధుని గౌరవించినాడు.

ప్రవరుని ఆతిథ్యమును స్వీకరించిన సిద్ధుడు ప్రవరునికి లేపనమును ప్రసాదించి మనుచరిత్ర సృష్టికే నాంది పలికిన వాడైనాడు - ప్రవరుని ఆతిథ్యము సరియైనది కాకపోయినచో మనుచరిత్ర మలుపు ఎలా వుండేదో.

# మానవసేవయే మాధవసేవ

కాలచక్రం తిరుగుతూ వుంది. చరిత్ర పుటలు పెరుగుతూ వున్నా
గతాన్ని మననం చేసుకుంటూ భవిష్యత్తుకు నాంది వేసుకుంటున్నా
నిర్మలమైన మనస్సు, నిస్వార్థమైన మానవత, ధార్మిక భావన సంఘటిత శ
జాలి దయ మానవుణ్ణి మహోన్నత శిఖరాలకు చేరుస్తుంది. సేవాభావాన్ని
రక్తంలో ప్రవహింపజేస్తుంది.

మానవసేవయే మాధవసేవ అన్న సూక్తి మానవ జాతి ఆవిర్భవిం
మరుక్షణం నుంచే పుట్టిందనక తప్పదు. ప్రతిప్రాణిలో ఈ సహకార భా
ఏదో రూపంలో అంతర్లీనమై వుంటుంది. పసిపాపను చంక నెత్తుకుం
తప్పటడుగులు వేయిస్తాం, చేయిపట్టి నడిపిస్తాం, పరుగులు తీస్తుంటే చ
పరమానంద పడతాం. మన అడుగుల్లో అడుగిడిన పాపను మనంత వేగ
నడిపిస్తాం. అలాగే నిస్సహాయులను అశక్తులను అనారోగ్యులను ఆదుకో
ఆప్యాయతలను పంచాలి.

బుద్ధుని బోధనలను మహాత్ముని మానవతావాదాన్ని మదర్ థెరి
సేవలని మానవజాతి ప్రపంచ చరిత్రలోనే సువర్ణాక్షరాలతో భద్రపరచు
తప్పదు.

తాము పుణ్యాత్ములము కావాలనే భావంతో మనలో ఎంతోమ
భగవానుని ఆరాధిస్తూ బాహ్య ప్రపంచానికి దూరంగా వుండ ప్రయత్ని
వుంటారు. కేవలం భగవంతుని ఆరాధిస్తూ ఏ పనీ చేయకుండా కూర్చు
భక్తుని లక్షణం కాదు. భగవంతుడు సర్వాంతర్యామి - ప్రతి ప్రాణియు ఆ
సృష్టియే, భగవానుని దృష్టిలో ప్రతి ప్రాణి సమానమే, జీవరహ
కర్మసిద్ధాంతం గురించిన విషయాలు మనం వింటూ చదువుకుం
తెలుసుకుంటూనే యున్నాం.

ఆధ్యాత్మికత మనకు "ఆత్మే పరమాత్మ" అని బోధిస్తూ ఉంది. ప్ర

వ్యక్తిలోను పరమాత్మను దర్శించి వారి సేవ జేయుటే మాధవసేవ అవుతుంది. సాటివానికి సహాయపడి మానవత మానవత్వం గలవారే సమాజమునకు మేలు చేయగలుగుతారు. మానవత్వం లేనివారు పశుతుల్యులు - భగవానుడు ఎల్లప్రాణులకు తండ్రి. దైవమునకు ప్రీతికరమైన సత్కర్మనాచరించే వారినే యిష్టపడుతాడు. తనను శ్లాఘిస్తూ సోమరులుగా కూర్చునేవారిని ఏమాత్రము యిష్టపడడు. కలలో కూడ ఎవరికీ కీడు తలంపక ప్రాణులను ప్రేమించే వారిని భగవానుడు ప్రేమిస్తాడు. "దయగల హృదయమే భగవన్నిలయము".

స్వార్థచింతన వ్యక్తి పతనమునకు నాంది. త్యాగము మానవున్ని ఉన్నతునిగా చేసి మహాత్మునిగా రూపొందిస్తుంది. అవకాశమే అదునుగా చూసుకొని పేదవారిని అమాయకులను మోసం దగా చేసి సమాజాన్ని తప్పు త్రోవలు తొక్కించి లక్షలు కోట్లు గడిస్తూ పాపప్రక్షాళన చేసుకుంటున్నాం అనే తృప్తి చెందడానికి ఏడుకొండలెక్కినా, ఎంతో హుండీలో వేసినా మచ్చ ఏనాటికి మాసిపోదు. అన్యాయంతో ఐశ్వర్యాన్ని ఆస్తులను భవనాలను పెంచుకుంటే ఏది మన వెంట రాదు. అందుకే యోగి వేమన...

మ ళ్లు వెంటరావు మణులు వెంటరావు
ఆలుబిడ్డలు హితులరయ రారు
తాను ఇచ్చు ఈవి తన వెంట వచ్చుగా
విశ్వదాభిరామ వినురవేమ.

జీవించి ఉన్నప్పుడు చేసిన ప్రజాహిత కార్యాల వల్ల వచ్చిన మంచిపేరే మనిషి సంపాదించుకోగలిగింది. కట్టిన పెద్ద భవనాలు సంపాదించిన కూడబెట్టిన నగా నట్రా పెళ్లాంబిడ్డలు - స్నేహితులు ఏవీ ఎవరూ మిగలరు చనిపోయేప్పుడు వెంటరారు. కాబట్టి బ్రతికున్న రోజుల్లోనే నలుగురికి ఉపయోగపడే పనులు చెయ్యాలని వేమన వాదం.

గాంధీజీ త్యాగం వల్లనే స్వాతంత్ర్యం సంపాదించగలిగాడు మహాత్ముడయ్యాడు. స్వార్థం లోభము భోగము ఈ మూడు బలమైన దురలవాట్లు దుర్గుణములు. వీటికి చాల దూరంగా వుండాలి. త్యాగము దానము యోగము ఇవి అలవరచుకొనుట వలన దుర్గుణములు నశిస్తాయి. త్యాగము వలన లోకకళ్యాణము, దానము వలన సత్కార్యముల నిర్వహణ యోగము వలన జీవన్ముక్తి ప్రాప్తిస్తాయి.

సాటివారిని ప్రేమించాలి, తాను వారిచే ప్రేమించబడాలి. "ప్రేమయే దైవము" కావున దైవమును చేరుకొనుటకు ప్రేమించుట నేర్చుకోవాలి.

అహింస, సర్వభూతదయ భగవాన్ బుద్ధుని బోధనలు - మానవులను మాత్రమే కాదు నోరులేని జీవులను సైతం ప్రేమించాలంటాడు - కలియుగ దైవము సత్యసాయిబాబా కూడా యిదే విషయాన్ని చెపుతాడు. "మీరు దేవుళ్లను పూజిస్తారు కాని జీవుళ్లను బాధిస్తారు" ఇది ఎంతయు శోచనీయము - ఒక వ్యక్తి తనకు నిరంతరము సేవ చేయుచున్న ఎద్దునకు సరియైన మేత నీరు అందించక హింసిస్తాడు. కాని శివాలయంలో శివుడి ఎదుట నిర్జీవంగా వున్న నందిని మాత్రం పూజిస్తారు ఆరాధిస్తారు. అలాగే కోతిని హింసిస్తారు కోతి రూపంలో వున్న ఆంజనేయుని పూజిస్తారు - దైవమును ఆరాధించుట చాల మంచి అలవాటు కాని దానితో పాటు జీవులను ప్రేమిస్తూ సేవజేయుట నేర్చుకోవాలి.

"మానవసేవయే మాధవసేవ" అనే విషయం మరువరాదు.



# "మతం మనిషిని మానవతావాదిగా సత్పురుషునిగా తీర్చిదిద్దాలి"

-బాబాసాహెబ్ అంబేద్కర్

రెండువందల సంవత్సరాల బ్రిటిష్ పాలనలో దాస్యం అనుభవిస్తున్న భారతదేశంలో ఒకవైపు స్వాతంత్ర్యోద్యమము సాగుచుండగనే మరోవైపు సంఘాన్ని సంస్కరించి, జాతిని నిర్వీర్యం చేసిన దురాచారాలను రూపుమాపడానికి అవతరించిన నవయుగ వైతాళికులలో తొలి తరంలో రాజారామమోహన్‌రాయ్, మలితరంలో డా. అంబేద్కర్ ప్రముఖులు. రామమోహన్‌రాయ్ సంఘంలో దురాచారాలను రూపుమాపడానికి ఉద్యమం సాగిస్తే డా. అంబేద్కర్ కుళ్ళు పట్టిన వ్యవస్థను వ్రేళ్లతో సహా పెకలించి నూతన సమసమాజ నిర్మాణానికి పునాదులు వేసిన మహనీయుడు.

మహారాష్ట్రలోని కొంకణ ప్రాంతం భారతదేశంలో ప్రసిద్ధి పొందినది. ఈ ప్రాంతంలో అంతర్భాగమైన రత్నగిరి జిల్లాలో 'అంటవాడ' ఒక కుగ్రామం. ఈ గ్రామంలో ఒక అస్పృశ్యుల జంట - రాంజీ మాలోజి సక్పాల్ మరియు భీమాబాయి. ఈ పుణ్యదంపతుల 14వ సంతానం అంబేద్కర్. 14 ఏప్రిల్ ఆయన జన్మదినం.

1900లో సతారాలోని ప్రభుత్వ పాఠశాలలో మొదటి తరగతిలో చేరి విద్యాభ్యాసం ప్రారంభించాడు. ఈయన పూర్తిపేరు భీమారావ్ రాంజీ అంబేద్కర్. ఈయన పసిప్రాయమందే వర్ణవ్యవస్థకు సంకుచితత్వమునకు గురైనాడు. 1907లో అంబేద్కర్ మెట్రిక్ ప్యాసయ్యాడు. ఆ రోజుల్లో నిమ్న కులస్థుడు మెట్రిక్ ప్యాసవడం గొప్ప విశేషం. ఈయనకు 14వ ఏటనే 9 ఏళ్ల ప్రాయం గల రమాబాయితో వివాహమైంది. 1912లో ఎలిఫిన్‌స్టన్ కళాశాల నుండి బి.ఏ పట్టాను స్వీకరించాడు. విద్యాభ్యాసానికి ప్రోత్సాహంగా బరోడా

మహారాజు శాయాజీరావ్ యొక్క ఉపకారవేతనం లభించింది. సంఘ సంస్కరణాభిలాషియైన సంస్థానాధీశ్వరుని ఆనాటి సహాయం భారత నిమ్నజాతుల చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖింపదగింది.

అంబేద్కర్ బరోడా సంస్థాన రక్షణశాఖలో ఉద్యోగిగా చేరాడు. ఆనాడు అగ్రజాతి అహంకారానికి హద్దులు లేవు. బంట్రోతులు కూడ సంస్థాన కార్యాలయంలో ఫైళ్లను అంబేద్కర్ చేతికి యిచ్చేవారు కాదు. ఆయన బల్ల మీదికి విసిరివేసేవారు. 1913లో బరోడా మహారాజు ఉపకారవేతనంతో అమెరికాలోని కొలంబియా విశ్వవిద్యాలయంలో ప్రవేశం పొందాడు. అస్పృశ్యకులానికి చెందిన ఒక విద్యార్థి విదేశ విశ్వవిద్యాలయంలో చదివే అవకాశం కలగడం ఒక అపూర్వ సంఘటన. అమెరికాలో అంబేద్కర్‌కు అభ్యుదయ భావాల పెరుగుదలకు అవకాశం ఏర్పడింది. కుల మత సంకుచితత్వ కారాగారం నుండి బయటికి వచ్చినట్లు భావించాడు. మనిషి రంగును చూచి, పుట్టిన కులాన్ని చూచి, కన్న తల్లిదండ్రులను చూచి మనుష్యుల వ్యక్తిత్వాన్ని నిర్ణయించే వాతావరణానికి దూరంగా ఉన్నట్లు భావించాడు.

అమెరికా స్వాతంత్ర్య పోరాటం, ఫ్రెంచి విప్లవముల సాహిత్యం అంబేద్కర్‌ను ప్రభావితం చేశాయి. వాల్టేర్, బెర్నార్డుషా వంటి మేధావుల రచనలు అంబేద్కర్ హృదయంలో విప్లవ భావాలు నాటాయి. అమెరికా దేశపు సిరిసంపదలు చూచి మురిసిపోక విలాస జీవితానికి బానిస కాక తన కర్తవ్యాన్ని మరువక ఆయన ఎల్లప్పుడు అధ్యయనంలోనే నిమగ్నుడయ్యేవాడు. 1917లో రాజనీతి శాస్త్రవిభాగం నుండి ఎం.ఏ పట్టాను పొందాడు. ఆ తరువాత కొలంబియా విశ్వవిద్యాలయం Ph.D పట్టాను ప్రదానం చేసింది.

అంబేద్కర్ స్వదేశానికి వచ్చి అంగీకరించిన ఒప్పందం ప్రకారం బరోడా మహారాజుకు సైనిక కార్యదర్శిగా చేరాడు. నిజంగా ఇది పెద్ద ఉద్యోగమే అంటరానివాడు కావటం వల్ల బంట్రోతులు కూడా ఫైళ్లు చేతికివ్వక బల్లమీదకు విసిరికొట్టేవారు. మహారాజుకు తన దీనస్థితిని విన్నవించుకున్నా ఫలితం లేకపోయింది. అప్పటినుండి ఆయనలో కులతత్వంపైన, హిందూ మతంపైన ద్వేషం ఏర్పడింది. మనిషిని మనిషిగా చూడలేని హిందూ మూఢ సంప్రదాయాలను నిర్మూలించాలనే సంకల్పం ఆయనలో కలిగింది.

బరోడా సంస్థానంలో ఉద్యోగం మానివేసిన తరువాత బొంబాయికి చేరుకున్నాడు. అచ్చట సైడన్‌హామ్ కళాశాలలో రాజకీయ ఆర్థిక శాస్త్రంలో ప్రొఫెసర్‌గా 1918లో చేరాడు. ఈ కాలంలోనే ప్రజాస్వామిక విలువలు, ఆధునిక విజ్ఞాన ఫలితాలు చారిత్రక సత్యాలు భారతదేశంలో కటిక దారిద్ర్యంలో సంస్కృతిక బానిసత్వంతో మూలుగుతున్న దళిత జాతుల మేల్కొల్పాలని విశ్వసించి అందుకై రాత్రింబవళ్లు కృషి చేశాడు. "మూక్ నాయక్" వారపత్రిక స్థాపించాడు. ఈ పత్రిక ద్వారా హిందూమతం శాసించిన కట్టుబాట్లను నీతినియమాలను శాస్త్రీయ దృష్టితో మానవ విలువల కోసమై విమర్శించి హిందూ సమాజంలోని అసహ్యతను అహంకారాన్ని అమానుష ప్రవర్తనను బయటపెట్టాడు.

1923లో బొంబాయి నగరంలో న్యాయవాదిగా క్రొత్త జీవితం ప్రారంభించాడు. ఈ వృత్తి ప్రధానంగా చేసికొని దళితజాతుల దాస్యశృంఖలాలను తెంచాలని నిర్ణయించుకున్నాడు. నిమ్నజాతుల మానసిక వికాసానికి ఎన్నో రకాల కృషి చేశాడు. ఇదే సమయంలో బొంబాయి రాష్ట్ర శాసనసభ్యుడిగా నియమించబడ్డాడు. దీనితో ఆయన జీవితం క్రొత్త మలుపు తిరిగింది. నిమ్నజాతుల ఉద్ధరణకు కృషి చేయడానికి అదనంగా అవకాశం కలిగింది.

1919 బ్రిటిష్ ఇండియా చట్టం ప్రకారం ప్రతి ఐదేండ్లకు ఒకసారి భారతరాజ్య చట్టాన్ని సవరించాలి. బ్రిటిష్ ప్రభుత్వం సర్ జాన్‌సైమన్ నాయకత్వాన బ్రిటిష్ పార్లమెంటు సభ్యులతో కూడిన సైమన్ కమిషన్ అను పేరుతో కూడిన ఒక సలహా సంఘాన్ని భారతదేశానికి పంపింది. సైమన్ కమిషన్‌తో సహకరించేందుకు వివిధ రాష్ట్రాల శాసనసభల సభ్యులతో కూడిన సలహాసంఘాలను రాష్ట్రప్రభుత్వాలు ఏర్పాటుచేశాయి. బొంబయి రాష్ట్ర సలహాసంఘం అంబేద్కరును సభ్యునిగా నియమించింది. ఈయన సైమన్ కమిషన్‌కు నిమ్నజాతుల స్థితిగతులపై సుదీర్ఘమైన మెమొరాండమును సమర్పించాడు.

ప్రజాసంస్థలలో జనాభాను బట్టి అస్పృశ్యులకు తగు స్థానాలు కేటాయించి వాటికి ప్రతినిధులను ఎన్నుకొనే అవకాశం ఉండాలని కోరాడు.

బ్రిటిష్ ప్రభుత్వం 1930లో లండన్ నగరంలో రౌండ్‌టేబుల్

సమావేశం ఏర్పాటుచేసింది. భారతదేశపు నిమ్నజాతుల ప్రతినిధులుగ
అంబేద్కర్ మరియు రావ్‌బహద్దర్ శ్రీనివాసన్ ఆహ్వానింపబడ్డారు. భార
రాజ్యాంగ నిర్మాణంలో నిమ్నజాతుల అభిప్రాయాలకు స్థానము ఉండాల
గ్రహించి బ్రిటిష్ ప్రభుత్వం నిమ్నజాతుల ప్రతినిధులతో సంభాషించడం గొ
విశేషం. సాంఘికంగా ఆర్థికంగా ఉన్నత కులస్థులచేత అణగద్రొక్కబడి
నిమ్నజాతి వాడైన అంబేద్కర్ రౌండ్‌టేబుల్ సమావేశమునకు ప్రతినిధి
వెళ్లడం మరీ విశేషం.

గాంధీజీ అంబేద్కర్ ప్రతిపాదనలను పూర్తిగా వ్యతిరేకించాడ
హిందూ సమాజం నుండి అస్పృశ్యులను వేరుచేస్తూ వారికి ప్రత్యేకమై
రాజకీయ రక్షణలు కల్పించడం ఆత్మహత్యతో సమానంగా భావిస్తానన్నాడ
ఈ విధంగా నిమ్నజాతుల రాజకీయ రక్షణల మీద గాంధీ అంబేద్కర్ల మ
పొడసూపిన బేధాలు వారిద్దరి జీవితాంతం వరకు సాగాయి.

1935 బ్రిటిష్ ఇండియా చట్టం ఆధారంగా భారతదేశం
స్వయంపాలన నెలకొల్పడానికి ప్రయత్నాలు జరుగుతున్న సందర్భం
అంబేద్కర్ "ఇండిపెండెంట్ లేబర్ పార్టీ" అను క్రొత్త రాజకీయ పార్టీ
స్థాపించాడు. ఎన్నికలలో పెద్ద మెజారిటీతో గెలుపొందాడు. ఆయన గెలు
నిమ్నజాతుల వారినందరినీ సంతోష సాగరంలో ముంచింది. గాం
అస్పృశ్యులను 'హరిజనులు' అని పిలిచేవారు. అంబేద్కర్ దీని
వ్యతిరేకించారు.

1942లో బ్రిటిష్ ఇండియా వైశ్రాయ్ తన నూతన కార్యనిర్వాహ
వర్గంలో అంబేద్కర్‌ను సభ్యునిగా నియమించాడు. దేశంలోని నిమ్నజాతు
ఈ నియామకం పట్ల హర్షాన్ని ఆనందాన్ని ప్రకటించాయి.

జవహరులాల్ మంత్రివర్గంలో న్యాయశాఖను అంబేద్క
నిర్వహించారు.

1947లో ఆగష్టు 29న స్వతంత్ర భారత రాజ్యాంగ ముసాయి
రచనాసంఘం ఏర్పడింది. అంబేద్కర్ దీని అధ్యక్షునిగా ఎన్నికైనాడు. రాజ్యా
రచన అత్యంత క్లిష్టమైన ప్రక్రియ. దీనికి విస్తృతమైన విజ్ఞానం విశాలమై
దృక్పథం గొప్ప రాజనీతి పరిణతి, మరియు అపార మేథాసంపత్తి ఎం
అవసరం. అంబేద్కర్ అధ్యక్షతన ఏర్పాటైన రాజ్యాంగ రచనాసంఘంలో అల్ల

కృష్ణస్వామి అయ్యర్, కె.ఎం. మున్షీ, ఎన్. గోపాలస్వామి అయ్యంగార్, మహమ్మద్ సాదుల్లా, ఎన్. మాధవ మీనన్ మరియు జి.పి. ఖైతాన్ వీరందరూ అహర్నిశలు శ్రమించగా అంబేద్కర్ నాయకత్వాన రాజ్యాంగ ముసాయిదా **1948** జనవరి నాటికి పూర్తి అయింది. **1950** జనవరి **26** నుండి మన రాజ్యాంగం అమలులోకి వచ్చింది. భారత దేశం సర్వసత్తాక ప్రజాస్వామిక గణతంత్ర రాజ్యమైంది.

**1956**లో దసరా పండుగ రోజున నాగపూర్‌లో అంబేద్కర్ బౌద్ధమతాన్ని స్వీకరించాడు. ఆ మతాన్ని స్వీకరించి తర్వాత ఆయనలో పూర్వం లేని ప్రశాంతత మానసిక సంతృప్తి ఏర్పడ్డాయి. నేపాల్ దేశరాజధానియైన ఖాట్మండు నగరంలో **1956**లో **4**వ ప్రపంచ బౌద్ధ జనమహాసభ జరిగింది. ఆ మహాసభలో ఆయన అత్యంత ఉత్సాహంతో పాల్గొన్నాడు. ఆయన ప్రతినిత్యం బుద్ధ విగ్రహం ముందు కూర్చుని గంటల తరబడి ధ్యానం జేసేవాడు. **1956** డిసెంబర్ **6**న అంబేద్కర్ పరమపదించారు.

అంబేద్కర్ వ్యక్తి స్వేచ్ఛావాది. స్వేచ్ఛావాతావరణంలో ప్రభుత్వాలు ఏర్పడాలి పాలన జరగాలి అని ఆయన వాదం.

అంబేద్కర్ మన రాజ్యాంగ నిర్మాతలలో ప్రముఖుడు. సాంఘిక సంస్కరణ ప్రధాన ధ్యేయంగా పెట్టుకొన్న విశిష్ట వ్యక్తిత్వం ఆయనది. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి. ఆదర్శ అధ్యాపకుడు, ఆధునిక అభినవ మనువు. సునిశిత గ్రంథకర్త, విశిష్ట కార్మిక నాయకుడు, ధర్మశాస్త్ర పరిజ్ఞాత, పరిపాలనా చతురుడు, ఉన్నత రాజనీతిజ్ఞుడు, పీడిత ప్రజల ఆశాజ్యోతి, దళిత జాతుల వైతాళికుడు.

ఆఆ

# మానవ జన్మ : పుత్రుని కర్తవ్యం

అనంతకోటి జీవులలో మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనది. మరియు అంత విశిష్టమైనది, ఉన్నతమైనది. అనాది మానవుడిని ఆధునాతన మహోన్నతుడిని పరిశీలిస్తే యింత నాగరికత పరిణతి చెందిన మానవ జన ఎంత ఉత్కృష్టమైనదో విదితమవుతుంది. దీనికి కారణం మానవునికి ఉన్న విజ్ఞత విధేయత.

పారాడే పాప పరుగెత్తేవరకు తల్లి తండ్రి చేయూతనిస్తూనే ఉంటార జన్మనిచ్చి ఉజ్జ్వల భవిష్యత్తును కోరే మాతృమూర్తి, పితృమూర్తు దైవస్వరూపులు. ప్రతి తండ్రి తన పిల్లల కోసం అహర్నిశలు ఆరాటపడుత ధనార్జన కోసము కృషి చేస్తూనే వుంటాడు. అది గ్రహించి ప్రతి పిల్లవాడు త కర్తవ్యాన్ని గుర్తెరుగాలి. జన్మను ప్రసాదించిన తల్లిదండ్రులను సేవించా పోషించాలి. ఒక సందర్భమున యోగి వేమన యిలా అంటాడు.

తల్లిదండ్రి మీద దయలేని పుత్రుండు
పుట్టనేమి వాడు గిట్టనేమి
పుట్టలోని చెదలు పుట్టదా గిట్టదా
విశ్వదాభిరామ వినురవేమ.

పుత్రుడు పుట్టాక, వాడి పుట్టుకకు కారకులైన తల్లిదండ్రుల వీ మమత మమకారం దయాదాక్షిణ్యం కలిగివుండి ప్రవర్తించడం సార్థకం. లేకపో తల్లిదండ్రుల మీద దయలేనివాళ్లు పుట్టడం వెనువెంటనే గిట్టడంతో సమాన

తల్లిదండ్రులమీద పూజ్యభావం, దయ కలిగి వుండటంతోబాటు వి విజ్ఞత కూడా ఉండాలి. అవి మనిషిని మంచిదారిలో నడిపి క్రమశి నేర్పుతాయి.

"విద్యయొసగును వినయమ్ము, వినయముననను
బడయు పాత్రత, పాత్రత వలన ధనము,
ధనము వలనను ధర్మంబు, దానివలన
నైహికాముష్మిక సుఖంబులందు నరుడు"

అని అన్నాడు భర్తృహరి.

విద్య వినయమును కర్తవ్యమును ధనమును సమకూరుస్తుంది. దానితో మనిషి అహంభావి కావద్దు. స్నేహభావాన్ని వీడవద్దు. తల్లిదండ్రులను తోటి మానవులను ప్రేమతో అనురాగముతో చూచుటకు ఆ విధముగా ప్రవర్తించుటకు ఉపయోగపడాలి. ఉపయోగించుకోవాలి.

ప్రతి మనిషి సంఘంలోని వ్యక్తి కాబట్టి సామాజిక దృక్పథంతో బాటు సంఘసేవ అలవరచుకోవాలి. సేవాదృక్పథం వున్న వ్యక్తి తిరిగి సేవించబడతాడు గౌరవించబడుతాడు పూజించ బడుతాడు. అప్పుడే జన్మకు సార్థకము సుఖం సౌఖ్యం అర్థం పరమార్థం.

శుభం

# విద్యాధనములు

ఈనాడు ప్రపంచములో అగ్రస్థానంలో ఉన్న ఏ దేశాన్ని పరిశీలించి అక్షరాస్యులే అధిక సంఖ్యలో కనబడుతారు. ప్రాచీన కాలం నుండి భర ఖండం సమస్త విద్యలకు పుట్టినిల్లై పరిఢవిల్లింది. ఇచ్చటి ప్రాచీ విశ్వవిద్యాలయాలు నలంద తక్షశిల వల్లభి దేశ విదేశ విద్యార్థుల ఆకర్షించాయి. వారిని ఎంతగానో ప్రభావితం చేశాయి.

విద్యజ్ఞాన నేత్రం. విద్యరానివాడు జాత్యంధుడు. దారీ తెన్ను లే ప్రయాణీకుని ప్రయాణము వలె విద్యలేని వాని జీవనయాత్ర అలా వుంటుం అందుచేత తల్లిదండ్రులు తమ పిల్లల బాల్యమంతయు విద్యాభ్యాసము లో యుంచుదురు.

ధనము క్లేశమునకు మూలము. ఇంత సంపాదించాను ఇక చాలు అనే తృప్తి యుండదు. ధనార్జనాపరునికి బంధువర్గముతో, మిత్రుబృందము సన్నిహితమే ఉండదు. అందరిని ద్వేషించుకుంటాడు. చివరికి అందరిచే వె వేయబడతాడు. ధనమదం మాత్సర్యమునకు దారి తీయును.

విద్య పురుషునికి భూషణం. దానితోనతడు ఉదర పోషణార్థ ధనసంపాదన చేయగల్గుతాడు. అందరికీ తలలోని నాలుకవలె ఆదరణీ భావంతో బంధువులతో మిత్రులతో మసలుకొంటాడు. వేద వేదాంగము అభ్యసించి ఇహపరలోకముల నర్థం చేసికొని మోక్షమార్గం అన్వేషిస్తాడు.

భర్తృహరి తన సుభాషితంలో విద్య సత్కీర్తి కల్గిస్తుందని, యుగాంత వరకు శాశ్వతంగా నిలుస్తుందని చెప్పినాడు.

ఉ. హర్తకు గాదు గోచర మహర్నిశమున్ సుఖపుష్టి జేయు, స
త్కీర్తి ఘటించు విద్యయను దివ్యధనం బఖిలార్థి కోటికిం
బూర్తిగ నిచ్చినం బెరుగు, బోదు యుగాంతపు వేళనైన, భూ
భర్తలు దద్ధనాధికుల పట్టున గర్వము మానుటొప్పగున్.

ధనమెచ్చిన మదమెచ్చును మదమెచ్చిన మత్సరంబు మరి మరి హెచ్చున్. ధనప్రభావాన్ని మేధావులు, పండితులు వివరించారు. విద్యవలన వివేకం, వివేకం వలన వినయం వస్తుంది. అనేకులచే ఆదరింప బడతాడు, గౌరవింపబడుతాడు. లబ్ధప్రతిష్టుడౌతాడు.

భర్తృహరి పురుషులకు విద్యయే భూషణమన్నాడు. వాగ్భూషణం మానవునికి సుభూషణ మన్నాడు. పవిత్రమైన వాణి మానవుని భూషింపజేస్తుంది. భౌతికమయిన భూషణములన్ని ఒకానొక దినమున నశిస్తాయి.

ఉ. భూషలు గావు మర్త్యులకు భూరి మయాంగద తారహారముల్
భూషిత కేశపాశ మృదుపుష్ప సుగంధ జలాభిషేకముల్
భూషలుగావు. పూరుషుని భూషితుజేయు పవిత్రవాణి, వా
గ్భూషణమే సుభూషణము భూషణముల్ నశియించునన్నియున్.

ధనమార్జించి విఱ్ఱవీగుతారు. కోటికి పడగలెత్తానని గర్వపడతారు. మరణం మనందరికి తప్పదు. విత్తమార్జించి వెళ్లిపోయేనాడు వెంటగొని పోలేడు. కవి కవనములు అల్లి లోకములో జ్ఞాన దీపికలు వెలిగించి ప్రజల అజ్ఞానాంధకారములు పారద్రోలు వాడు. కవి రచనలు కల కాలము నిలిచిపోతాయి.

వేమన ధనము దాచిన వాని ధనము ఎవ్వరికి ఉపయోగపడక వృథా అవుతుందన్నాడు. ధనము మట్టిలో దాచినవాడు చివరికి ఆ ధనము ఆ ధనవంతుడు మట్టిలోనే కలిసిపోతారు. మంటిలో ధనము దాచిన మంకుజీవి తన వెంట కానియైన కొనిపోలలేడు.

ఇంటిలోని ధనము యిది నాది యనుచును
మంటిలోన దాచు మంకుజీవి
కొంచబోడు వెంట గుల్ల కాసైనను
విశ్వదాభిరామ వినురవేమ.

లక్ష్మి, సరస్వతీ అత్తాకోడండ్రు. ఒకరి ప్రభావమున్నప్పుడు ఇంకొకరి ప్రమేయము ఉండదు. అందుచే కాబోలు లోకములో ఒక ఇంట లక్ష్మి

తాండవం చేస్తుంది. కాని సరస్వతి ఎంతమాత్రం ఆశ్రయం పొందదు శ్రీనాథకవి సార్వభౌముడు చివరిదశలో అష్టకష్టాలతో జీవితం గడుపుతాడు సరస్వతి వున్నచోట లక్ష్మికి స్థానముండదంటారు. విద్యాగంధము లేని వాని వద్దనే ధనరాసులు మూలుగుతుంటాయి.

వేమనయోగి విద్యలేని వాణ్ణి నడుపీనుగు (నడయాడు) అనగ జీవచ్ఛవం అన్నాడు.

కుడువ ముడువలేక కూడు బెట్టగ లేక
ఇడువ నుడువలేక విద్యలేక
నడువ నేరని వాని నడుపీనుగందురు
విశ్వదాభిరామ వినురవేమ.

ధనము పరులకిచ్చినచో తరుగునే గాని పెరుగదు. అలా తరుగుతు తరుగుతూ చివరికి నశిస్తుంది.

విద్య పరులకిచ్చినను పెరుగునే గాని తరుగదు. అది ఒక జ్ఞానజ్యోతి ఒక దీపము నుండి మరియొక దీపము వెలిగించి కాంతివంతమ చేయగలుగుతాము. విద్య పదిమందికి పంచితే మరీ శోభిస్తుందే గాని క్షోభించదు నశించదు. కవి కవనములు అల్లి లోకంలో జ్ఞానదీపికలు వెలిగిస్తాడు ప్రజల అజ్ఞాన తిమిరాన్ని పారద్రోలుతాడు.

భర్తృహరి "విద్య వినయము కల్గిస్తుంది. వినయం వలన పాత్రత పాత్రత వలన ధనం, ధనం వలన ధర్మం, దానివలన ఇహ పరలోకములలో సుఖములు పొందవచ్చు. మోక్షము ప్రాప్తిస్తుంది" అన్నాడు.

# ప్రశంసించుట

ప్రశంసించడము స్తుతించడము, స్తోత్రించడము కొద్ది తేడాలు వున్నప్పటికి అన్నీ ఒక్కటనే చెప్పాలి. ఇవి ప్రత్యక్షం - పరోక్షం అనే కాకుండా మరో రకము కూడా వుంది. తనకు తానే గొప్పలు చెప్పుకొని సొంత బాకా వూదుకునే రకం - ఈ నాగరిక ప్రపంచంలో ఇవి బాగా పెరిగి సత్కారాలు సన్మానాల రూపములో పరిపూర్ణంగా అభివృద్ధి గాంచినవి.

ఈ ప్రశంస అనునది అనాదిగా పురాణకాలము నుండి వస్తూవున్నది. రాముని గుణ గణములను స్తుతించే హనుమంతుడు రామకార్య సాధనలో సమర్థుడయ్యాడు.

ఎవరి యందైనా మంచి గుణములు వున్న యెడల ఆ గుణములను ప్రశంసించి సన్మానించవలయును, ప్రశంసించడము లేక స్తోత్రము చేయడము కూడా ఒక కళయే. దాని వలననే దేవతలు ప్రసన్నమయ్యారని పురాణగాథలు చెప్తున్నాయి. యిక మనుష్యుల విషయము చెప్పవలసిన దేమున్నది. దైవస్తోత్రముల యందు ప్రార్థనల యందు దేవతల యొక్క గుణములను ప్రశంసించడమే కనబడును. లౌకిక వ్యవహారములలో ఎవరినైనా సంతోషపెట్టవలెనన్న వారి గుణములను యితోధికంగా ప్రశంసించడము జరుగుతూ వున్నది. ప్రశంసించడము వలన దానవులు కూడా దేవతలవలె ఉదారులగుదురు. ఎంత క్రూర వ్యక్తియైనా ప్రశంసించబడినప్పుడు దయార్థ్ర హృదయుడగుచున్నాడు. అయితే ఎవరి యందైనను ఉన్న గుణములనే ప్రశంసించవలయును. ఉన్న గుణములకు మించి ప్రశంసించినను లేని గుణములు ప్రశంసించినను అది ప్రశంస కాజాలదు. అది అబద్ధపు ప్రశంస. స్వార్ధపరులు తమ కార్యములు గట్టెక్కించుకొనుటకు అబద్ధపు ప్రశంసలు చేయుదురు.

హనుమంతుడు విద్యలోగాని బుద్ధిలోగాని శక్తిలోగాని అద్వితీయుడు. అంత గొప్ప గుణములు తనలో ఉన్న విషయము తనకు తెలియదు. అందుచే తానందరి కంటే తక్కువ వాడినని అనుకొనుచుండెడివాడట.

సీతాదేవిని రావణుడు ఎత్తుకొని పోయినప్పుడు రాముడు లక్ష్మణుడితో కలిసి సీతాదేవిని వెదుకుతున్న సమయములో హనుమంతునితో వారికి పరిచయము కలిగినది. హనుమంతుడు రామునికి సుగ్రీవుడితో పరిచయము కలిగించినాడు. సుగ్రీవుడు వానరరాజు కావున సీతాన్వేషణకు వానరులను పంపించినాడు. వారందరిలో ఒక్క హనుమంతుడే సీతాదేవిని కనుగొని రావణుని సంహారమునకు తోడ్పడినాడు. ఆంజనేయునిలో విద్య-బుద్ధి-శక్తిసంపదలు అనేకం వున్నాయని, శ్రీరామచంద్రుడు గ్రహించినాడు. అందుచేతనే సీతాన్వేషణకు వెళ్లుచున్న వానరులలో ఒక్క హనుమంతుడిని మాత్రమే పిలిచి ఆనవాలుగా సీతాదేవి గుర్తించుటకై తన అంగుళీయకమును యిచ్చి, ఆంజనేయా! నీవు బలమునకు బుద్ధికి నిధివి, నా తమ్ముడు భరతుని కంటే నీవు నాకెక్కువ ప్రియపాత్రుడవు. నీవు సాధించలేని పనేమియు వుండదని నాకు పూర్తి విశ్వాసము వున్నది అని శ్రీరామచంద్రుడు ప్రశంసించగా ఆంజనేయునికి గర్వము గాని అభిమానము గాని కలుగలేదు ఈ ప్రశంస వలననే ఆంజననేయునకు అమితోత్సాహము కలిగినది. దానివలన శ్రీరామ కార్యమును సాధించగలిగినాడు. ప్రశంసలు, పొగడ్తలు నైతిక విలువలను పెంచునవిగా వుండవలయును గాని ప్రగతికి నిరోధకములు కాకూడదు. కాని నేడు ప్రశంసలు మరియు సన్మానములు తాముగా తాము చేయించుకొని సంఘంలో గుర్తింపు పొందుతున్నామని భావించే వారలున్నారు అక్రమాలతో అవినీతితో ధనార్జన చేసి ప్రజాహిత కార్యక్రమములను కలలోనైనా తలపెట్టని, కీర్తికండూతి పదవి కాంక్షను పెంచుకొని, ప్రజల గుర్తింపు మన్నన పొందవలెననే కాంక్షతో భారీ ఎత్తున నిలువెల్ల మాలలతో సన్మానాలు చేయించుకునే మహానుభావులు, మనకు దర్శనమిస్తున్నారు.

*"వాపువాపే గాని బలుపుగాదు"*

అనే సామెత ఎన్నటికిని తప్పు కాదు. ఇక తమ గొప్పలు తామే చెప్పుకు తిరిగే అధఃమ రకంవారు కూడా ఈ సంఘంలో లేకపోలేదు. ప్రశంసించేవారు లేక ప్రశంసింప జేయించుకునే ఆర్థిక స్థోమత లేక తమకు తామే గొప్పవారమనే భావనను పెంచుకొని తమ డప్పు తామే కొట్టుకుని తృప్తి జెందే బుద్ధి గలవారు కూడా వున్నారు. మంచివారి లక్షణములు చెప్తూ సుమతిశతకకారుడు ఒక పద్యం చెప్పాడు.

తన యూరి తపసి తనమును
తన పుత్రుని విద్యపెంపు, దనసతి రూపున్
దన పెరటి చెట్టుమందును
మనసున వర్ణింప రెట్టి మనుజులు సుమతీ!

ఈ దేశమున జన్మించి దేశం కోసం , ప్రజల కోసం తమ జీవితాలను అర్పించిన ఎందరో మహానుభావులను మనం నేటికినీ ప్రశంసించు కొనుచున్నామంటే వారిలోని త్యాగనిరతి, అంకిత భావములే విదర్శనములు.

తమ కార్యసాధన, దీక్షయే తమకు ప్రశంసలను సమకూరుస్తుంది.

కాని పొగడ్తలను ప్రశంసలుగా భావించకూడదు.

# అరిషడ్వర్గము

ఈ ప్రపంచంలో సృష్టింపబడిన ప్రాణికోటిలో మానవజన్మ ఎంతో ఉత్కృష్టమైనది. మనకు శక్తిని మేధస్సును ప్రసాదించిన భగవంతుడు, మానవతకు ప్రతిరూపమైన మానవరూపంలోనే భగవంతుడు సాక్షాత్కరిస్తున్నాడు - యింత ఉత్కృష్టమైన జీవి మనిషి.

రాతి యుగం నుండి నేటి యుగం వరకు భౌతిక మార్పుతో పాటు మేధస్సు ఎంతో పరిపక్వత చెందింది. వ్యక్తిగతంగా కాక సంఘటితంగా ఎన్నో విజయాలను సాధిస్తున్నాడు మానవుడు.

సంఘ జీవితంలో కులాలు, మతాలు, సంఘాలు, పార్టీలు ఎన్నో వెలిశాయి - వీటితోపాటు ఆధిక్యత సంపాదించడానికి ప్రయత్నాలు - రానురాను అన్యోన్యత కొరవడుతుంది. సమన్వయం అంతరిస్తూ వుంది, శతృత్వం పెరుగుతుంది. దానికి కారణాలను మనం ఒకసారి పరిశీలిస్తే తప్పక వక్ర మార్గాన్ని సరిదిద్దుకోగలం.

కామము, క్రోధము, లోభము, మోహము, మదము మరియు మాత్సర్యములు మనిషిలో అంతర్లీనమైన శతృకూటమి. ఈ శతృకూటమి స్వభావస్వరూపాలను పరిపూర్ణంగా అర్థం చేసుకొని జయించగలిగితే మానవుడు మహనీయుడవుతాడు. ఈ శతృకూటమిని "అరిషడ్వర్గములు" అని వ్యవహరిస్తాం.

కామము అంటే కోరిక, ఆపేక్ష విషయాభిలాష అని అర్థము. శ్రీకృష్ణపరమాత్ముడు అర్జునునకు అరిషడ్వర్గముల నుండి కలుగు అనర్థములను వివరిస్తూ అన్నింటికిన్నీ కామమే మూలకారణమని బోధించాడు.

దుర్యోధనుడు, రావణుడు లాంటి వారు రాజ్యములను కోల్పోయి సర్వనాశనము చెందారు. ఆసక్తి నుండి కామము, కామము నుండి క్రోధము

క్రోధము నుండి సమ్మోహము, సమ్మోహము నుండి స్మృతిభ్రమణము, స్మృతిభ్రమణము నుండి బుద్ధినాశము, బుద్ధినాశము నుండి వ్యక్తి యొక్క నాశనము జరుగును. అందువలన కామము నిగ్రహించగలిగితే తక్కిన వాటిని జయించినట్లే.

క్రోధము అనగా కోపము - సుమతికారుడు కోపం గురించి మనకు భాష్యం చెప్పాడు.

తన కోపమె తన శత్రువు
తన శాంతమె తనకు రక్ష దయచుట్టంబౌ
తన సంతోషమె స్వర్గము
తన దుఃఖమె నరక మండ్రడు తథ్యము సుమతీ

మనిషిలోని కోపము శత్రుత్వాన్ని పెంచుతుంది, అవర్ధాలకు దారి తీస్తుంది. మనిషిని పశుత్వంలోనికి లాగుతుంది. అనారోగ్యాన్ని సమకూరుస్తుంది. బి.పికి ముఖ్యకారణమవుతుంది. మనోవికలత పెంచుతుంది. వెంటనే శాంతము కావాలి. శాంతి రక్షిస్తుంది, దయ చూపుతుంది. ఆత్మబంధువై మేలు చేస్తుంది. సంతోషానికి మించిన స్వర్గం లేదు. దుఃఖము భూలోక నరకాన్ని సృష్టిస్తుంది. యిన్ని అనర్థాలకు కారణము కోపము, క్రోధము. లోభము అంటే అతి ఆశ, అతి ఆశే దురాశ అవుతుంది. దురాశ నుండి సంగ్రహబుద్ధి, కూడపెట్టుట అలవడుతుంది. లోభి అయినవాడు తాను స్వయంగా జీవితంలో మంచి వస్తువుల భోగము పొందడు. యితరులను కూడా పొందనివ్వడు. తాను తినక యితరులకు పెట్టక దానములు చేయక ధనమును సంపాదించి, మట్టిపాలు చేస్తాడు తాను మట్టి అవుతాడు.

మోహము నాల్గవది. మోహము అనగా అజ్ఞానము అని అర్థము. భ్రాంతి పూర్తిగా లొంగిపోవుట అని అర్థము. యిది నానా రూపములు దాల్చుతుంది. నానా రకములు చెందివుంటుంది. ధనమోహము, సతిమోహము, జననీజనకుల మోహము, బంధుమోహము, ఈ మోహము అజ్ఞానమునకు నాంది - అజ్ఞానము ఆత్మ సాక్షాత్కారమునకు ప్రతిబంధకము.

ఐదవది మదము. మదము అనగా మత్తుగర్వము, అహంకారము అని అర్థము. ధనమదము యౌవన మదము, విద్యామదము, పరిజన మదము, అధికార మదము.... ఏది ఏ మదము కాని అది అధఃపాతాళమునకు నాంది - గర్వము వలన నాశనము పొందిన ఎందరో వ్యక్తులు మన చరిత్ర కాలగర్భంలో కలిసిపోయారు.

యిక చివరిది మాత్సర్యము. కడుపునొప్పి, అసూయ, ఓర్వలేని తనము, మాత్సర్యము ద్వేషమునకు కారణమవుతుంది. విషాన్ని మనస్సులో నింపుతుంది. చెడు తలంపులకు దారితీస్తుంది. అనుమానములు పెరుగుతాయి. విషబీజాలు నాటుకుని మహావృక్షాలై ప్రబలుతాయి.

తలనుండు విషము ఫణికిని
వెలయంగా దోకనుండు వృశ్చికమునకున్
దలతోక యనక నుండును
ఖలునకు నిలువెల్ల విషము గదరా సుమతీ

అన్నాడు సుమతికారుడు. యితరుల ప్రగతి, అభివృద్ధి, బాగుపడుటను చూసి అసూయపడితే వారికేమి లోటురాదు. అసూయ చెందిన వారే నష్టపడుతారు.

# కోపము - దాని నివారణోపాయాలు

మనుషులందు జనించు రోగములు అనంతములు. వానిని లెక్కించుటకు సాధ్యపడదు. కాని రోగములన్నింటిని శారీరకములు, మానసికములు - అని రెండు భాగాలుగా విభజించవచ్చు. శారీరకమైన రోగములన్ని బయటికి కనిపిస్తాయి. వైద్యులు పరీక్షించి ఇది ఫలానా రోగమని నిర్ధారించగలుగుతారు. ఇంకా అవసరమైతే నేడు వైద్యరంగం సాధించిన అత్యాధునిక శాస్త్ర సాంకేతిక పరికరాలైన ఎక్స్రే - టివిల ద్వారా నిశితంగా పరీక్షలు చేసి నివారణకు ఉచిత చికిత్సలతో నయం చేయగలుగుతున్నారు.

ఇక మానసిక సంబంధమైన రోగములు సూక్ష్మములై బయటికి కనబడవు. ఇవి శారీరక రుగ్మతల కంటె ఎంతో భయంకరమైనవి. వీటి అన్నింటిలో ప్రముఖమైన, ప్రబలమైన రోగం క్రోధం. ఇది ప్రతివారియందు తరతమ భేదములతో నుండును. కొందరి యందు అధికముగా నుండి తీవ్రమైన అనర్థాలకు, అవమానాలకు దారితీస్తుంది.

ముక్కోపియైన దుర్వాసమహర్షి అపర్ణాహవేళకు ఆలస్యమయిందని ఆగ్రహోదగ్రుడై పరమ భాగవతోత్తముడైన అంబరీషుని శపించి అవమానాల పాలైన పురాణాల గాథ మన అందరికీ తెలిసిందేగదా!

ప్రజాకవి వేమన "కోపము మంచిది కాదని కీడు కలిగిస్తుందని ఘనతకు విఘాతం కలిగిస్తుందన్నాడు".

కోపమున ఘనత కొంచెమై పోవును
కోపమునను మిగుల గోడు చెందు
కోపమడచె నేని కోరిక లీడేరు
విశ్వదాభిరామ వినురవేమ

కోపమధికముగా గల పురుషుడు క్రూర మృగమున కంటె భయంకరుడు, వాని ఆకారమే వికారంగా మారిపోవును.

హిట్లర్‌కు కోపం వచ్చినపుడు ఖడ్గమృగమునకు వలె అతని నోటినుండి

(సొల్లు) నీరు కారెడిదట. కామక్రోధములు నరక ద్వారములు -ఆత్మనాశనకరములు. తల్లి కోపముతో బిడ్డకు పాలిచ్చినచో ఆ పాలు విషం వలె మారిపోతాయని, కోపముతో వంటలు చేసినచో ఆ వంటకముల నుండి భయంకరమైన రోగములు ఉత్పత్తి అవుతాయని, స్త్రీలు కోపమనస్కురాంద్రై భోజన పదార్థములు వడ్డించగా తిన్న ఆహారం కడుపులోనికి పోయి ద్వేషాన్ని, అసూయను పుట్టిస్తాయని పెద్దలంటారు.

వేదమూర్తులైన బ్రాహ్మణోత్తములు, వేదమంత్రములు పఠిస్తుండగా, త్రికరణశుద్ధిగా, అగ్నిసాక్షిగా, పెద్దల సమక్షమున వివాహమాడిన ఆలిని - సాంసారిక జీవితంలో ఏదో ఒక చిన్న సమస్యపై క్షణికావేశంతో కిరోసిన్ పోసి నిండు నూరేండ్ల జీవితాన్ని అగ్నికి ఆహుతి చేసి తన బ్రతుకును కటకటాల మధ్య నరకప్రాయం చేసుకున్న భార్యాహంతకులు మనకు కనిపిస్తూనే ఉన్నారు. ఇలాంటివి ఎన్నో హృదయ విదారక సంఘటనలు నిత్యం పత్రికలలో చదువుతూనే ఉన్నాం. కోరికతో జనించిన కోపం రజోగుణం నుండి పుట్టును. సన్నిపాత రోగం కంటె, పిచ్చితనం కంటె, త్రాగుబోతుతనం కంటె క్రోధం కడు భయంకరం.

మనస్సు స్థిరమైనది కాదు. పరిసరాల ప్రభావం వల్ల అనవసర కార్యకలాపాల వల్ల చంచలత్వం ఏర్పడుతుంది. కాన మనోనిబ్బరం చాల అవసరం.

కోపం భూతం లాంటిది. దానికి బలి కాకుండా శాంతితో సహనంతో చిరునగవుతో మెలగగల గృహిణి, గృహ యజమాని తన కుటుంబమును స్వర్గధామం చేసుకోవచ్చును.

కుటుంబంలో ఏర్పడిన సంఘటనలన్నింటిని చిరునగవుతో సంతోషముతో మార్చివేయగలిగిన స్త్రీ గాని, పురుషుడు గాని ఉత్తమమైన నాగరికతకు, సంస్కారానికి చెందిన వారగుదురు.

కోపం వస్తే మరుక్షణంలో మాయం కావాలి. క్షణకోపం సుగుణం కాని కొందరి కోపం వారం పది రోజుల వరకు ఒక డిగ్రీ కూడా దాని తీవ్రత తగ్గదు ఇది చాలా ప్రమాదం. ఇది పశుత్వం కంటె నీచమైన స్థితి. ఇంకా కొందరు దీర్ఘకాలం పాము వంటి పగను కలిగియుందురు.

ఉత్తములు తమకు పరులు చేయు అవమానములను నీటిపైన గీతల వలె ఎప్పటికప్పుడు మరచిపోతుంటారు. ద్వేషము కోపము దుఃఖభాజనములు.

మానసిక దుఃఖము నుండి బయటపడుటయే దీనికి ఏకైక మార్గము. తీవ్రమైన పశ్చాత్తాపముతో దృఢనిశ్చయంతో ప్రయత్నించిన క్రోధమను శత్రువును దూరం చేసికోగల మార్గం గోచరం కాగలదు.

మొదట సృష్టిరహస్యములను తెలిసికొనవలెను. తద్వారా భగవద్భక్తి కలుగును. భక్తి చేత జ్ఞానోత్పత్తి దాని నుండి దుర్గుణ నివృత్తి దుఃఖరాహిత్యం సుఖప్రాప్తి లభించి జీవితం ధన్యం కాగలదు.

శ్రీ

# కోపం - క్రోధం

క్రోధం అన్ని దుర్మార్గాలకు దుర్గుణాలకు మూలం, అందువల్ల ఎప్పుడూ కోపానికి దూరంగా వుండాలి. మనం అందరితో మంచిగా వుండడమ్మూ సాధ్యపడదేమో. అలాగే అందరూ మనతో మంచిగా వుండాలనుకోవడమ్మూ కూడదు. విధి విధాన్ని అనుసరించి అన్నీ జరుగుతున్నప్పుడు మనం అనుకున్నవన్నీ జరగటం లేదని బాధపడి విచక్షణ కోల్పోడం సమంజసం కాదు.

మానవ కళ్యాణం కొరకు సామాజిక చైతన్య దృష్టితో కవిత్వం చెప్పాడు వేమన. ద్వేషం కోపం అసూయ అసహ్యం ప్రేమ భక్తి సహనం వల్లనే రూపొందుతాయి - మనిషి సహనాన్ని కోల్పోతే గొప్పతనం మంట కలుస్తుంది. ఎదుటివారికి దుఃఖం బాధ కలుగుతుంది. కోరికలు తీరక కోప్పడితే లాభం లేదు. కోపాన్ని నిగ్రహించుకుంటేనే కార్యం సానుకూలమవుతుంది. కోపం కలిగినప్పుడు వివేకం నశిస్తుంది మనస్సు అదుపు తప్పుతుంది, వాడే భాషలో మర్యాద లోపిస్తుంది వ్యాకులత ఉగ్రత అశాంతి హింస మొదలగు వినాశకర భావాలు ఉత్పన్నమవుతాయి.

క్రోధాన్ని పెంచుకుంటే మనిషి మానసిక రోగి అవుతాడు. అందువల్ల స్వభావం మారిపోయి, దురుసుతనం అహంకారం అవిశ్వాసం ఉద్వేగం అస్థిరత కపటం పెరుగుతాయి. ఆరోగ్యం దెబ్బ తింటుంది, అశ్లీలమైన హింసాకరమైన మాటల ప్రభావం శరీరం మీద పడుతుంది. సంహారం వినాశనము చెయ్యాలనే కోరికల వలన హత్యకుగాని ఆత్మహత్యకు గాని ప్రేరణ జరుగుతుంది.

క్రోధం తమోగుణ రూపము తమోగుణం వినాశకరం అది నీచకార్యాలను చేయిస్తుంది. ప్రమాదకరమైన పనులకు పురిగొలిపి అధోగతి కలికి తీసుకుపోతుంది, క్రోధం మనిషికి మహాశత్రువు దానివల్ల సుఖశాంతులు ఇహపరసాధన భక్తి ముక్తి అన్నీ నాశనమవుతాయి.

. కోపం శారీరక మానసిక సౌందర్యాన్ని నాశనం చేస్తుంది. కోపంలో వున్న ునిషిలో త్యాగం దయ సేవ శాంతి సద్భావన న్యాయం వివేకం ఆరోగ్యమైన ఆలోచనలు ఆధ్యాత్మిక భావనలు నశించిపోతాయి. కోపం క్రోధాన్ని పెంచి క్తపోటు పెంచుతుంది. మొహం ఎర్రబడుతుంది. కళ్లు రోషారుణాలవుతాయి. నుబొమ్మలు వికృతంగా ముడుచుకుంటాయి శరీరం కంపిస్తుంది పెదవులు ుదురుతాయి మూర్ఖత్వం ప్రవేశిస్తుంది మనిషి మృగమవుతాడు. విధ్వంసమో నాశమో జరుగక తప్పదు.

యిన్ని విధాల మానవ మనుగడనే మార్చే శక్తి గలది కోపం-క్రోధం శచరిత్ర ప్రపంచ చరిత్రను పరిశీలిస్తే కోపం వలన ఎన్ని వినాశకర ంఘటనలు జరిగాయో మన కళ్ల ముందు కదుల్తాయి.

కోపము నాశనానికి నాంది పలుకవద్దు. వైఫల్యం చెందకముందే గ్రత్త వహించాలి. ఈ ప్రపంచ మందు జన్మించిన సర్వ ప్రాణులలో మానవ న్మ ఎంతో ఉత్కృష్టమైనది. వివేక విజ్ఞానములతో పాటు కామక్రోధాలు కూడా ానవునిపై ప్రభావాన్ని కలుగజేస్తాయి. వివేక విజ్ఞానములను పెంచుకుని ామక్రోధాలను తృంచుకున్ననాడే మానవుడు మహోన్నత శిఖరాలను ధిరోహించగలడు. క్రోధమును ఎంతగా పెంచుకుంటే మానవుడు అంతగా ధఃపాతాళమునకు అణచబడుతాడనే విషయము పురాణగాధలే కాక ప్రత్యక్షంగా మనం నిత్యజీవితములో చూస్తూనే వున్నాం.

కోపమును మించిన శత్రువు శాంతమును మించిన రక్షణ దయను ుంచిన చుట్టము సంతోషమును మించిన స్వర్గసుఖము దుఃఖమును మించిన ురక బాధ లేదవి సుమతి శతకకారుడు ఎప్పుడో తన నీతిశతకములో ివరించాడు.

మనుష్యులకు వచ్చేడి జబ్బులు అనంతములు ఈ జబ్బులను న్నింటిని కలిపి విభజిస్తే - శారీరకములు మానసికములని రెండు ాగములుగా విభజించ వచ్చును. మానసిక సంబంధమైన రోగములు బహుసూక్ష్మములై యుండి కంటికి కనిపించవు. అయినను శారీరక రోగముల ంటె భయంకరమైనవి. వీటిలో ప్రముఖమైన రోగము క్రోధము ఇది ప్రతి ఒక్కరిలో తరతమ భేదములతో వుంటుంది. కొందరిలో అధికముగా వుండి తీవ్రమైన అనర్థములను కలిగిస్తుంది. క్రోధము అధికముగా కలిగివున్న

పురుషుడు క్రూరమృగము కన్నా భయంకరుడని చెప్పవచ్చును. హిట్లరుకు కోపము వచ్చినప్పుడు క్రూరమృగము వలె నోటినుండి నురగలు వచ్చేవట - ఒకనాటి రాత్రి క్రోధ పరవశుడైన భర్త భార్య తలపై రాతిబండ వేసి చంపి తానుగా పోలీస్‌స్టేషనుకు వెళ్లి అప్పగించుకున్నాడట, తను జైలు పాలైనాడు పసిబిడ్డలు రోడ్డు పాలైనారు నిండు జీవితాలు కారుచీకట్లో కలిసిపోయినవి. రాజ్యకాంక్ష క్రోధము పెంచుకొని ఇరాక్ కువైట్ సోదరులు మన కళ్లముందే ఎంతోమంది భస్మమైనారు. భగవద్గీతలో నరకమునకు మూడు ద్వారము లున్నట్లు చెప్పబడినవి.

"త్రివిధం నరకస్సేద్యం ద్వారం నాశన మాత్మనః
కామః క్రోధ స్తథాలోభః తస్మాదేత్త్రయం త్యజేత్"

కామము క్రోధము మరియు లోభము మూడు నరక ద్వారములు. ఆత్మనాశన కరములు కావున ఈ మూడింటిని త్యజించ వలయునని అర్థము. కోపమనే భూతమునకు వశపడకుండా శాంతితో సహనముతో చిరునవ్వుతో మెలగగల గృహయజమాని ఆ గృహిణి తమ కుటుంబమునందు ప్రత్యక్ష స్వర్గమును సృష్టించగలరు. సంసారమందలి అన్ని సమస్యలను చిరునవ్వుతో సంతోషముగా ఎదుర్కొనే మనస్తత్త్వం గల స్త్రీపురుషులు ఉత్తమమైన నాగరికత సంస్కృతికి చెందిన వారవుతారు. కోపము వస్తే మరుక్షణంలో మరిచిపోవడమనునది గొప్ప సుగుణమవుతుంది మరియు ఆరోగ్యమునకు శ్రేయస్కరమవుతుంది. కోపతీవ్రత వయస్సును బట్టి రక్తపోటుకు దారి తీస్తుంది. ప్రాణాలు తీస్తుంది. కొందరు ద్వేషాసూయ భావములను దీర్ఘకాలము కలిగి వుండి బ్రతుకున్నంత కాలం పరుల ద్వార తమకేమో అవమానము కలిగినదని, చులకనగా మాట్లాడినట్లు భావించి పగబూని క్రోధమును పెంచుకొందురు. యిట్టివారు ఎల్లప్పుడు దుఃఖముతో కుములుతూ జీవితము గడపక తప్పదు. ఇట్టి దుఃఖము నుండి ప్రతివారు దూరమగుటకు ప్రయత్నించవలయును. మానసిక దుఃఖము నుండి విడివడుటయే దీనికి ఏకైక మార్గము.

గొప్పతనం గౌరవం ప్రేమ భక్తి - ద్వేషం కోపం అసూయ అసహ్యం వలన మంట గలుస్తాయి. ఎదుటివాళ్లకు దుఃఖం బాధ కలుగజేస్తాయి. కోరికలు తీరక కోప్పడితే లాభం లేదు కోపాన్ని క్రోధాన్ని నిగ్రహించుకుంటేనే కార్యం సానుకూలమవుతుంది.

# 'పొరుగింటి పుల్లకూర'

పాలకడలినే నివాసముగా చేసుకొని శేషతల్పముపై పవళించే విష్ణుమూర్తి! కృష్ణమూర్తి అవతారములోకి వచ్చేసరికి గోపికల ఇండ్లలో! పిల్లల కొరబడి పాలు పెరుగు వెన్నను దొంగిలించి ఆరగించాడు. నాటకమిదంతా! రాచబిడ్డకు పాడి కొదవకాదుగా! అందుకే తెలుగులో ఒక సామెత వుంది 'పొరుగింటి పుల్లకూర రుచి'' అని.

పరుల సొమ్ము ప్రీతి అనే విషయములో యోగి వేమన వివరించాడిలా

పాల సాగరమున పవ్వళించిన సామి<br>
గొల్ల యిండ్ల పాలు గోరనేల<br>
ఎదుటివారి సొమ్ము ఎల్లవారికి తీపి<br>
విశ్వదాభిరామ వినురవేమ.

ఆవిధంగానే నేడు పరభాషను పరసంస్కృతిని సంస్కారంగా భావించి చివరికి కట్టు బొట్టు వేషాలను గూడా మార్చుకుంటున్నారు. ఒకనాటి ఆచారాలు నేడు అపచారాలయ్యాయి. విశ్వాసాలు మూఢవిశ్వాసాలుగా మారాయి.

భాషలన్నిటిలోన తెలుగులెస్స అన్న రాయల మాట - మాట తప్పిందేమో అనే అనుమానం కలుగుతూవుంది.

పసిపాపల నాలుకపై 'అ' అనే అక్షరాన్ని వంటబట్టకుండా 'ఏ'తో ప్రారంభిస్తున్నారు. తెలుగు భాష 'అ'తో ప్రారంభించబడింది. అమ్మ అని పిలిస్తే అవమానంగా తలిచే రోజులొచ్చాయి. తల్లిని "మమ్మీ" అంటే వాళ్ళ ఆకాశమంత ఎదిగిపోతుంది. అలా పిలిపించుకోవడానికి పల్లెల్లో సైతం అర్రులు సాచుతున్నారు. మమ్మీ డాడీ అని పిలిస్తే ఆ శిశువు అప్పుడే డాక్టరో లాయరో ఇంజినీరో అయిపోయినంత సంతోషం తల్లిదండ్రులలో కలుగుతూ వుంది.

పక్కింటి పాప రాగానే అంకుల్, అంకుల్ అంటే ఉన్నారా! మా మమ్మీ

చూసి రమ్మన్నారు అంటుంది. పక్కింటి. ఆడవాళ్లు మాట్లాడుకోవడంలో కూడా మీల్స్ చేశారా? బ్రదర్ ఆఫీసు నుంచి యింకా రానట్లున్నారే, అనే పలకరింపులో కూడా తనకు ఆంగ్లభాష వచ్చున్నట్లు వ్యక్తపరచడం అవుతుందేమో మరి!

అప్పు అడగడానికి వచ్చిన పెద్దమనిషి కూడా ఫైవ్ రూపీస్ స్పేర్ చేస్తారా? అనేది నేటి సంస్కారమయింది.

టైం రోడ్ సిగరెట్ సైకిల్ రైల్ లాంటి ఎన్నో పదాలు తెలుగులో జీర్ణించుకున్నాయి. పరభాష పనికి వచ్చే భాష నేర్చుకోవడం మంచిదే, కాని వేలం వెర్రిగా సంస్కృతినే మార్చివేసే ప్రయత్నం మంచిది కాదేమో. ప్రాంతీయ భాషలు జాతీయభాషలు అంతర్జాతీయ భాషలు ఎంతైనా అవసరమే, వాటితోపాటు మాతృభాషను మన సాంప్రదాయమును కూడా గౌరవించడం అన్న విషయం విస్మరించకూడదు.

భాషలే కావు వేషాలు కూడా మారినవి. స్త్రీని ఎంతో పవిత్రమూర్తిగా మన సంస్కృతి భావిస్తుంది. ... గౌరవిస్తుంది. నేటి వేషధారణ చూస్తే తెలుగు సాంప్రదాయం రూపాయ విలువలాగా యింతగా పడిపోయిందా అనే అనుమానం వస్తుంది. ఒకనాటి సమాజంలో వృత్తిప్రవృత్తులు వేషాలను మార్చినవి. కాని నేడు పాశ్చాత్య పోకడలు సంస్కృతినే మార్చుతున్నాయి. వెనకనుండి చూస్తే మగ ఆడను గుర్తుపట్టే పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ఈ అనుకరణలు పల్లెలోని వ్యవసాయ కుటుంబాలలో సహితం అవతరించాయి స్కర్టులు, నైటుగౌనులతో నూతన సాంప్రదాయం వెలుస్తుంధి.

ఆహారము విషయంలోకి వస్తే "అన్నం పరబ్రహ్మ స్వరూపం"గ భావించారు మన పెద్దలు. శుచిశుభ్రతతో రుచికరమైన వంటకాలత పరిశుభ్రముగా కాళ్లుచేతులు కడుక్కొని భోంచేసేవారు. నేడు టేబు పద్ధతులు వచ్చాయి. కాళ్లుచేతులు కడగడం అటుంచి చెప్పులు బూట్ల విడవకుండా భోజనానికి ఉపక్రమిస్తుంది నేటి సాంప్రదాయం.

త్యాగయ్యలాంటి ఎంతోమంది సంగీత విద్వాంసులు మహాపురుషు జన్మించి లయతాళాలకు ఊపిరి పోసి సంగీతాన్ని మనకు సమకూరిస్తే, నేడు డిస్కో, పాప్ మ్యూజిక్‌లపై మమకారం పెంచుకుంటున్నాం మనం. కూచిపూ భరతనాట్యాలు స్త్రీలకు నాట్యకళనే కాకుండా పరిపూర్ణ వ్యాయామము అంగసౌష్టవమును సమకూర్చితే - నేడు రాక&రోల్ డిస్కో బ్రేక్ డాన్సు

రత సంస్కృతిని పాత చింతకాయ పచ్చడని మూట గట్టుకొని పదిలంగా ుకోమంటున్నాయి.

ఈ పోకడలు కొత్త వ్యసనాలుగా మారి యువత నడత మారకూడదు నడ్డి విరుగకూడదు.

సంస్కృతి, సంస్కారము మానవాళి మనుగడకు వెలుగుబాట వాలిగాని - పొరుగింటి పుల్లకూర అనే సామెతను పోషించకూడదు.

# పరభాష, సంస్కృతిపై మోజు

బాలకృష్ణుడు విష్ణువు యొక్క అవతారమే. విష్ణువు కృష్ణుడు ఒక్కడే. కృష్ణావతారంలో బాలకృష్ణుడు యశోదకు గారాబాల పట్టి. ఆమె పుత్రవాత్సల్యానికి అవధులు లేవు. వారిది రాచకుటుంబం వారి ఇంట్లో పాలు పెరుగు వెన్న దండిగా నిండుగా వున్నాయి కాని బాలకృష్ణుడు గోపికల ఇండ్లల్లో పాలు పెరుగు వెన్న దొంగిలించుట పొరుగింటి పుల్లకూర కాబోలు. .

ఈ రోజుల్లో కొందరి ఇళ్లల్లో వీధిగుమ్మానికి Welcome Boar తగిలించి వుంటుంది. కొందరి ఇండ్లకు వెడితే ముందు వసారాలో ఆడుకుంటున్న అమ్మాయి కనబడుతుంది. ఆ అమ్మాయి తటాలున ఆట ఆ మనను సమీపించి అంకుల్ లోపలికి రండి కూర్చోండి అంటుంది. వెంట DADDY లోపల ఉన్నారు అంటుంది. ప్రక్కింటి అబ్బాయి మన ఇంటికి వ Uncle! Uncle! Aunty ఇంట్లో ఉన్నారా! మా మమ్మీ చూసి రమ్మన్నారు అ అడుగుతాడు. తెలుగులో స్వాగతం, సుస్వాగతం, మామయ్య, అత్తయ్య అ మాటలు లేనట్లు. ఈ విధంగా చాలా సందర్భాలలో భాషాగంధం లే స్త్రీపురుషులు కూడా Meals చేశారా! Brother ఆఫీసు నుండి వచ్చారా! అ మాట్లాడుకుంటారు. ఇలా మనకాశ్చర్యం కలిగేటట్లు ఆంగ్లభాషా పదప్రయో కనిపిస్తుంది.

ఇక వీధిలో కొట్టు పెట్టుకున్న వ్యాపారి ఎదురుగా No Credit బో పెట్టుకుంటాడు. ఎవరైనా వెళ్లి దినవెచ్చములు అడిగితే Sorry Sir మీ అడిగిన వాటిలో ఫలానా వస్తువు లేదంటాడు. అరువు అడిగితే సారీ అంటా మీరు పాతబాకీ చెల్లించండి, లేకపోతే Credit ఇవ్వనంటాడు.

ఐదు రూపాయలు అప్పు అడగడానికి వచ్చిన పెద్దమనిషి నాకు F Rupees Spare చేస్తారా! అని అడుగుతాడు. ఈమాత్రపు వ్యవహారా తెలుగు సాహిత్యంలో ఆ భావ ప్రకటనకు సరితూగగల పదజాల కరువైనట్లు.

మాకు ఆంగ్లభాష తెలియునని ప్రకటించుటకు కాబోలు 'సమయము'
ను పదమునకు బదులు TIME ఆంగ్లపదం ప్రయోగిస్తారు. ఈ విధంగా
న్నెన్నో తెలుగు భాషాపదాలు పూర్తిగా వాడుకలో లేకుండా పోయే ప్రమాదం
ంది. చివరికి అతిసామాన్యమైన కొన్ని చిన్న పదాలు నిఘంటువులకే
రిమితమయ్యే సూచనలు కనిపిస్తున్నాయి.

ఇతరులతో మాట్లాడేటప్పుడు కొందరు ఆంగ్లభాషా పదములు
కుండ మాట్లాడలేరు. ఇంకా కొందరు కొన్ని వాక్యములు తెలుగులో , కొన్ని
క్యములు ఆంగ్లంలో మాట్లాడుతారు. ఎవరైనా అచ్చ తెమగులో పూర్తిగా
ాట్లాడితే, అతడు ఆధునిక కాలం మనిషి కాదనే భావంతో చిన్నచూపు
ాస్తారు.

ఇక వ్రాత విషయానికొస్తే కొందరు బంధువులకు మిత్రులకు
త్తరములు ఇంగ్లీష్‌లోనే వ్రాస్తారు. తెలుగులో వ్రాయడానికి కష్టపడతారు.
త్తర ప్రత్యుత్తరములు ఆంగ్లంలో వ్రాయడమే నవనాగరికత అనుకుంటారు
బోలు.

ఇంకా ఆధునిక నాటకకర్తలు, సినిమాలకు కథలు, మాటలు
ాసేవారు వారి సాహిత్యంలో ఆంగ్లపద ప్రయోగం ఎక్కువగా చేస్తారు. అలా
ంగ్లపద ప్రయోగాలు చేయకపోతే నాటకం రక్తి కట్టదని, సంభాషణలు
జీవంగా ఉండవని. వారి అభిప్రాయమై ఉంటుంది. మనకు ప్రాచీన నాటకాలు
నట్లు అవి జనబాహుళ్యాన్ని రంజింప చేయనట్లు భావిస్తారు. మనకీకాలంలో
ంగ్ల పదప్రయోగం లేని నాటిక గాని నాటకం గాని కథానిక గాని సంభాషణలు
ని కనిపించవేమో అనిపిస్తుంది.

ఈనాడు పవిత్రమైన వివాహ శుభపత్రికలు ఆంగ్లంలోనే అచ్చు
యిస్తున్నారు. అందులో స్వస్తివాచకము తెలిపే శ్లోకమే ఉండదు. అతి
ంక్షిప్తంగా ఆంగ్ల సంస్కృతికి దగ్గరగా ఉండేటట్లు ఆంగ్లభాషలో అచ్చు
యిస్తారు. మన సంస్కృతి సంస్కారము సాహిత్యం వారికి కవబడదు
ాబోలు. తెలుగులో వచ్చే వివాహ శుభలేఖలే బాగా తగ్గిపోయాయి.

ఇక తెలుగు వారపత్రికలలో, మాసపత్రికలలో ప్రచురింపబడే
్యాసాలలో ఎక్కువగా ఆంగ్ల పదప్రయోగమే కనబడుతుంది. తెలుగుభాషలో
ేని పదములు మరియొక భాషనుండి అవసరమైనపుడు ఎరువు తెచ్చుకొని
ాడుకలోనికి తీసికొని రావడం మంచి సాంప్రదాయమే కాని తెలుగులో

అర్ధవంతమైన శక్తివంతమైన పటుత్వం గల పదములు కోకొల్లలుండగా వాటిని విడిచి వాని స్థానంలో వానికి బదులుగా ఆంగ్లపదములు ప్రయోగిస్తే అది సబబుగా ఉండదు.

కొందరు తెలుగు తల్లి బిడ్డలుగా జన్మించి ఉగ్గుపాలతో తెలుగు తేనె మాటలు పలికి కొంతవరకు తెలుగులో విద్యాభ్యాసం చేసి, కేవలం పైచదువులకై ఆంగ్లమభ్యసించినవారు తెలుగు సాహిత్యసభలలో వక్తలుగా అతిథులుగా వెళ్లి తెలుగుతేటదనము తెలుగు మాధుర్యం ఆంగ్లభాషలో కొనియాడుతూ ఉపన్యసిస్తారు.

ఇక మన ఆచార వ్యవహారాలు పరిశీలిద్దాం. పంచెకట్టు కనిపించకుండ పోయి ఏనాడో పంట్లాంలు వాటి స్థానంలోకి వచ్చేశాయి. ఆడపిల్లల పరికిణీలు అదృశ్యమై వాటికి బదులు ఏనాడో స్కర్టులు వచ్చాయి. వివాహాది శుభకార్యములలో కూడా పంచకట్లు కనిపించడమే లేదు. పెండ్లికొడుకును పెండ్లిపీటల మీద సఫారీ సూట్లతో, బూట్లతో చూస్తూనే ఉన్నాము కదా!.

ఇక ప్రతి ఇంట్లో పంచాంగం ఉండేది. ఐదు అంగాలతో కూడి ఆస్తికులకు హిందువులకు నిత్యనైమిత్తిక ఆచార సంస్కారాలలో మార్గదర్శకంగా ఉండే కరదీపిక లాంటిది పంచాంగం. నేడు తెలుగు పంచాంగం స్థానంలో ఇంగ్లీష్ క్యాలెండర్లు వచ్చాయి. ఇంగ్లీష్ తేదీలే పరిగణనలోకి తీసుకుంటున్నారు. పుట్టినరోజు పండుగలు పంచాంగ నిర్దేశిక తిథులతో కాకుండ క్యాలెండర్ తేదీల ప్రకారమే జరుపుకొంటున్నారు. భోగిపండ్లు పిల్లలకు పోసే మన ఆచారం స్థానంలో Cake Cuttings వచ్చాయి. కాన్వెంట్ పాఠశాలలపై బాలబాలికల యొక్క తల్లిదండ్రుల వ్యామోహం చూస్తుంటే మనకాశ్చర్యం కలుగుతుంది. ఆ ఖర్చులూ ఆ దుబారావ్యయం, చదువు చారెడు బలుపాలు దోసెడు అను లోకోక్తి గుర్తుకొస్తుంది.

నాడు ప్రాథమిక విద్యాస్థాయిలో పాఠశాలలో పెద్ద బాలశిక్ష చదివించేవారు. దాని స్థానములో నేడు నర్సరీ రైమ్సు వచ్చాయి. పీట మీద కూర్చొని భోజనం చేసే పీటభోజనం స్థానంలో Table Meals పరిపాటి అయ్యింది.

కోలాటములు బుర్రకథలు హరికథలు చెప్పేవారు లేరు వినేవారే లేరు. నేడు డిస్కోడ్యాన్సులు బ్రేక్‌డ్యాన్సులు అంటే మనలో చాలామందికి అపరిమితమైన ఆనందం.

మన కట్టు బొట్టు మన ఆచారాలు, సాంప్రదాయాలు మంచిని )డిచిపెట్టి పాశ్చాత్య నాగరికతా వ్యామోహములో పడిపోయి వాటిమీద మోజు ంచుకొని స్వీయ సంస్కృతికి దూరమై పోతున్నామనిపిస్తుంది. పొరుగింటి ల్లకూర చందమున.

నాల్గు సంవత్సరాల క్రితం రష్యా దేశపు సాంస్కృతిక కళాప్రదర్శక ృందం మన దేశంలో ప్రదర్శనలిచ్చుటకు వచ్చింది. వారు వారి మాతృభాష తప్ప మరియే ఇతర భాషలో మాట్లాడలేదు. మన ప్రతినిధులు వారితో మాట్లాడేటప్పుడు దుబాసీలను పెట్టుకున్నారు. ఎవరి ప్రాచీన సుసంపన్నమైన ంస్కృతి వారు పరిరక్షించుకోవడం ఉదాత్తమైన కార్యం.

# సత్యము

గాంధీజీ సత్యము అనే మూలసూత్రం నుండి తన సత్యాగ్రహ సిద్ధాంతమును రూపొందించుకొని ఉన్నారు. అసంపూర్ణుడగు మానవుడు సత్యము యొక్క సంపూర్ణ స్వరూపమును కాదుగదా లౌకికమైన ఖండసత్యమును సైతము దాని పూర్ణరూపంలో అవగాహన చేసికొనలేడు. అందువల్ల ఒక మనిషికి సత్యముగా గోచరించునది, ఇంకొక మనిషికి అసత్యముగా గోచరించవచ్చును. అయినప్పటికిని ఆ. ఇరువురి భావన తమ తమ విభిన్న దృక్పథముల నుంచి సత్యసంయుత కావచ్చును.

ఈ రీతి ఆలోచనా ఫలితంగా గాంధీజీ ప్రథమ దశలోనే సత్యము ననుసరించవలెనంటె, తనతో భిన్నాభిప్రాయం గల ప్రత్యర్థి యెడల బలప్రయోగ విధానాన్ని అవలంబించడం తగదనే నిర్ణయానికి వచ్చి ఉన్నారు. అందువల్ల గాంధీజీ సత్యాగ్రహ నిర్వచనంలో గర్భితమైన సత్యసూత్రమునకు అర్థము స్వీయబాధా సహనము ద్వారా అనగా ప్రేమ ద్వారా సత్యమును నిరూపించుట అని చెప్పుకోవలసి ఉంటుంది. ఆ రీతిగా అహింసాసత్యములు ఒకే నాణెమునకు రెండు పార్శ్వములుగా భావించవచ్చును. వాటితో ఒకటి సాధనము రెండవది లక్ష్యము అన్నారు గాంధీజీ.

గాంధీజీ సత్యాగ్రహము కేవలము భావనారూపకమైన తాత్విక సిద్ధాంతముకాదు. అది ఆచరణ రూపకమైన తాత్విక సిద్ధాంతము. ఆయన దృష్టిలో సత్యమంటె కేవలము వాగ్రూపమైనదీ విశ్వాసప్రకటన రూపమైనదీ కాదు. అది జీవితం ద్వారా నిరూపితం కావలసినటువంటిది. ఒకటి చెప్పి వేరొకటి చేసినా ఒక విశ్వాసాన్ని ప్రకటించి దానిని ఆచరణలో పెట్టుటకు వెనుదీసినా మనము అసత్య జీవనులమవుతాము. భావనకూ మాటకు విశ్వాసానికి ఆచరణకు నడుమ ఏర్పడే విచ్ఛిత్తి ప్రతివ్యక్తి తను గర్భితమై ఉన్న ఆత్మశక్తి యొక్క ప్రకాశమునకు నిరోధకములుగా వర్తిస్తుంది.

సత్యము ఋజు ప్రవర్తన మనిషి యొక్క నైతిక విలువలను పెంచుతుంది.

నీతి తెలియజెప్ప నిజముగ వేమన
పాతకముల నెల్ల పారబట్టి
లోతు తత్త్వమరసి లోకులకునుజెప్పె
విశ్వదాభిరామ వినురవేమ.

నీతిని తెలియజేయడానికి వేమన పాపాలన్నింటిని నిరోధించి తత్వాన్ని లోతుకెళ్లి చూశాక లోకులకు చెప్పారని ఈ పద్యం వినగానే స్ఫురిస్తుంది. అయితే నీతి అంటే ఏమిటి? మంచి నడతను బోధించేది నీతి, సమాజశ్రేయస్సును కోరేది నీతి ధర్మాన్ని కాపాడేది నీతిజ్ఞానాన్ని పెంచేది నీతి.

ఎరుగకుంట లెస్స యెరుగుట లెస్స
యెరిగి యెరుగకుంట మేటిలెస్స
కచ్చికచ్చి యెరుక కలుగుట రోతరా
విశ్వదాభిరామ వినురవేమ.

జ్ఞానం లేకపోతే మంచిదే జ్ఞానమున్నా మంచిదే తెలిసి తెలియని తెలివి ఎలా మంచిదవుతుంది? కయ్యానికి కాలుదువ్వే జ్ఞానం అసహ్యాకరం అజ్ఞానం.

సత్యశోధన మానవునిలోని అజ్ఞానాన్ని, అంధకారాన్ని దూరంగా పారదోలుతుంది మనిషిని మహనీయున్ని చేస్తుంది.



# సత్యము

## (వర్ణవ్యవస్థలో సత్యం)

సత్యము అంటే నిజము పలకడము ఒక్కటే కాదు, జీవన విధానములో సత్యాన్వేషణ అవసరమని మహాత్ముడు సెలవిచ్చాడు.

మనం సాధించాలనుకొన్న స్వేచ్ఛాస్వాతంత్ర్యాలు ప్రజలందరి వన్న పరమ సత్యాన్ని ఆ ప్రజలను కూడా తెలుసుకోనివ్వాలి. "తెలుసుకోవడము" సిద్ధాంతాల అధ్యయనం ద్వారా కాక అనుభవాల ద్వారా తెలుసుకోవడము మరీ అవసరము.

"అందరిని కలుపుకపోవడము" అన్నది గాంధీజీ అవలంబించిన సుతిమెత్తని విధానం.

"ఒకే మనిషి మరొక మనిషిని అంటుకోకూడదన్న నియమం నాకర్థం కాదు. దీన్ని ఈశ్వరునికి అంటగట్టడం కన్నా భగవదపచారం వేరే లేదు. మానవుల మధ్య అంతరాలు ఉండడం భగవదేచ్ఛ అయితే, అలాంటి భగవంతున్ని గురించి నేను మరోమారు, ఇంకోమారు ఆలోచించవలసి ఉంటుంది" అన్నారు గాంధీజీ.

సత్యాన్వేషణలో యోగి వేమన మరోలా వివరించాడు.

తాత గన్న తల్లి తమ తండ్రి గన్న తల్లి
తన్ను గన్న తల్లి తల్లి తల్లి
తల్లి శూద్రురాలు తానెట్లు బాపడు
విశ్వదాభిరామ వినురవేమ.

ధర్మశాస్త్రాలన్నీ ఆడవాళ్లనీ శూద్రులనూ ఒక గాట కట్టేశాయి. అగ్రవర్ణాల స్త్రీలైనా సరే వాళ్లకి శూద్రుల్లా స్వేచ్ఛలేదు. వేదాధ్యయనాధికారం లేదు. తరతరాలుగా బ్రాహ్మణ వంశాల్లో తాతమ్మ, నాయనమ్మ, అమ్మమ్మ, అమ్మ అందరూ శూద్రులే. తల్లి శూద్రురాలైతే తానెలాగ బ్రాహ్మణుడు అవుతాడు? అని వేమనగారు ప్రశ్నించారు.

యజ్ఞోపవీతం బ్రాహ్మణత్వానికి చిహ్నం అయితే ఇది ఎప్పటి నుంచి వచ్చింది? ప్రాచీన ఋగ్వేద కాలంలో ఆర్యులకు యజ్ఞోపవీతాలు లేవు. అటువంటి ఆర్యులను వ్రాత్యులు అంటారు. రాను రాను ఋగ్వేదములోని పదవ మండలం రచించే దశ వచ్చేసరికి వర్ణాశ్రమ ధర్మాలు ఏర్పడి నేడు పురుషసూక్తరాప్రచారం పొందిన మంత్రాల రచన సంభవించినది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనే వర్ణాలు విరాట్పు రుషుని ముఖము నుండి బాహువుల నుండి తొడల నుండి పాదాల నుండి పుట్టాయనే మూఢ నమ్మకాన్ని పుట్టించారు. ఈ వర్ణాలలో మొదటి మూడు అగ్రవర్ణాలు, వీళ్లకు ఉపనయనం చేసుకునే అధికారం వుంది. ఉపనయనం అంటే ఇంకొక జన్మ క్రింద లెక్క. అందుకే అగ్రవర్ణాల వాళ్లను ద్విజులంటారు.

కానీ ద్విజుడన్నమాట విప్రుడికే పర్యాయపదం అయింది. ఈ ద్విజుడు మొదట పుట్టినప్పుడు యజ్ఞోపవీతం ఉందా? అని ప్రశ్నించిన వేమన-

జనన కాలమందు జందె త్రాళ్లును లేవు
తనదు సతికి సర్వదానులేవు
నడుమ జందెమిడగ నగుబాటు గాదొకో
విశ్వదాభిరామ వినురవేమ.

ఈ దేశ స్వాతంత్ర్యాన్ని దశాబ్దాల పర్యంతరం వాయిదా వేయడానికి నాకేమి అభ్యంతరము లేదు. నా తక్షణ సమస్య దేశస్వాతంత్ర్యం కాదు, ఈ దేశంలో భాగస్వాములైన లక్షలాది మంది అస్పృశ్యులకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను సాధించడము నా ప్రధాన కర్తవ్యం. అంటరాని వారిని ఈ ఉద్యమంలో చేర్చుకొన్నందుకు సవర్ణ హిందువులు ఆగ్రహంతో ఉన్నారన్న విషయం నాకు తెలుసు అని సత్యాన్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పారు బాపూజీ.

మానవులందరూ ఒక్కటే, "ఐకమత్యమే మహాబలము" అనే సత్యాన్ని గ్రహించాలి అని బోధించారు గాంధీజీ.

# కాలము - దాని విలువ

కాలచక్రం తిరుగుతూ వుంది. చరిత్ర పుటలు నిండుతూ వున్నాయి, గడిచిన కాలానికి చరిత్ర సాక్ష్యం చెబుతూ వుంది. భావితరాలకు గడిచిన చరిత్ర మార్గదర్శి కావాలంటే కాలం దుర్వినియోగం కాకూడదు. చరిత్రకు ఔన్నత్యాన్ని ఆపాదించగలిగే శక్తి కాలానికే వుంది. అలాంటి విలువైన కాలం వృధా కాకూడదు.

డబ్బును ధారాళంగా ఖర్చు చేయగలము, మళ్లీ తిరిగి సంపాదించగలము, కానీ గడిచిన కాలాన్ని మాత్రం తిరిగి పొందలేము. బాల్యం, యవ్వనం వృద్ధాప్యం క్రమేణా సంక్రమిస్తూనే వుంటాయి. బాల్యం నుండి యవ్వనములోకి యవ్వనం నుండి వృద్ధాప్యంలోకి చేరగలం గాని, వృద్ధాప్యం నుండి యవ్వనంలోకి, యవ్వనం నుండి బాల్యంలోకి రాలేము. కాలగమనాన్ని వెనక్కి త్రిప్పలేము - అందుకే బాల్యంలో అభ్యసించాలి యవ్వనంలో ఆర్జించాలి వృద్ధాప్యంలో అనుభవించాలి అంటారు. ఇదే మానవ చరిత్ర.

మనిషి ఆశాజీవి అంతేకాదు ధన్యజీవి కూడా. ఎందుకంటే మనిషికి భగవంతుడు మేధస్సును ప్రసాదించాడు. కాలాన్ని సద్వినియోగ పరుచుకుని మేధస్సుకు పదును పెట్టి భవిష్యత్తుకు ఉజ్వల బాటలు వేసిననాడే ప్రగతిని సాధించగలం.

రాజులు రాజ్యాలు రాజరికాలు వైభవాలు కాలగర్భంలో కలిసిపోయాయి కాని చరిత్ర మాత్రం మిగిలిపోయింది. రాజరిక వ్యవస్థలోని దేవాలయాలు కట్టడాలు నాటి కాలానికి నిదర్శనాలు- వారి మేధస్సుకు ప్రతీకలు. ఆ విధంగానే ప్రజాస్వామ్య వ్యవస్థలోని ప్రణాళికలు ప్రాజెక్టులు నేటికాలానికి నిదర్శనాలు.

సూక్ష్మదృష్టితో పరిశీలిస్తే మహానుభావుల ప్రవచనాలు కొన్ని మనం ఎప్పుడూ మననం చేసుకోకతప్పదు. "కల్ కరేసో ఆజ్‌కర్ - ఆజ్ కరేసో అబ్‌కర్" అన్న కబీరు సూక్తులు కాలాన్ని వేగంగా అందుకొమ్మని ప్రభోదిస్తున్నాయి. రేపును నేడే తలంచి నేటిని ఈ క్షణమే ప్రారంభించమన్నాడా మహానుభావుడు.

సోమరితనాన్ని కొరడాతో కొట్టమన్నాడు. అలాంటి మహానుభావునికి యావత్ మానవజాతి దాసోహం అనక తప్పదు.

"అర్లీ బర్డ్ క్యాచ్ ద వామ్" అన్న ఆంగ్లసూక్తి మనందరికీ తెలిసిందే - వేకువలోనే లేచిన పక్షి ఆకలిని త్వరగా తీర్చుకోగలదంటాడు. ఈ విషయాన్ని ముఖ్యంగా విద్యార్థులు ఎల్లవేళల మననం చేసుకోవాలి.

విజ్ఞాన సముపార్జన అనంతమైనది. ఈ విశ్వంలో సాహిత్య విజ్ఞానం క్షణక్షణాభివృద్ధి గాంచుతూ వుంది. ఏ క్షణాన్ని వృథా చేయకుండా మనకు కావలసిన పరిజ్ఞానాన్ని విజ్ఞానాన్ని పొందాలన్నా మానవునికి ఒక జీవితకాలము సరిపోని పరిస్థితి ఏర్పడింది.

కాలం యొక్క విలువను గుర్తెరిగి క్రమేణ అభివృద్ధి చెందాలి. మెట్లన్నీ అధిరోహిస్తేగానీ మేడపైకి చేరగలం. కాలాన్ని వినియోగించుకోవడములో ఏ చిన్న పొరపాటు జరిగినా అది మనిషి జీవితంపై ఎంతో ప్రభావము చూపుతుంది. అందుకే వేమన అంటారు-

కుండ పగిలెనేని కొత్తది కొనవచ్చు
భూతలంబు నందు పొందుగాను
కూలబడిన నరుడు కుదురుట అరుదయా
విశ్వదాభిరామ వినురవేమ.

కుండ పగిల్తే అతుక్కోదు, పగిలిన కుండ పారేసి కొత్త కుండ కొనుక్కోవచ్చు. కాని మనిషి ఒక్కసారి దెబ్బ తిన్నాడా కోలుకోవడం కష్టం. జీవిత గమ్యమే మారుతుంది. తప్పటడుగు ప్రవాహంలో కొట్టుకుపోయి ఏదరికి చేరుతామో ఊహించలేము అందుకే మన అధీనంలో కాలము గడవాలి.

జీవితములో ఉరుకులు పరుగులు మొదలయ్యాయి. విద్యారంగంలో ఉద్యోగరంగంలో వ్యాపారరంగంలో ఉపాధిరంగంలో స్థానం లభించాలంటే గమ్యం చేరాలంటే ఎంతో వేగంతో పయనించాలి సమయస్ఫూర్తితో మసలుకోవాలి.

విద్యార్థి దశ యెంతో అమూల్యమైన దశ ఎంతో విలువైన కాలం పిల్లలకు కాలం విలువ తెలియదు. కాలం విలువ తెలుసుకునే నాటికి వయస్సు పెరిగిపోతుంది. ఈ విషయంలో పెద్దలు శ్రద్ధాసక్తులు చూపాలి పిల్లలను సరియైన మార్గంలో పెట్టాలి. మొక్కగా వున్న కాలంలో వంచితే మ్రానై వంగి

వుంటుందంటారు పెద్దలు. దాంట్లో నిగూఢమైన అర్థం నిబిడీకృతమై వుంది. చెట్టును మానవ జీవితంతో పోల్చారు. లేత్రప్రాయంలో ప్రయత్నిస్తే ప్రతిదానిని మనకు అనుకూలముగా మలుచుకోవచ్చును. సర్కస్ మనం అందరం చూస్తూనే వున్నాం. ఎన్నో రకాల విన్యాసాలతో పాటు క్రూరమృగాలను గమనిస్తూ వున్నాం. సింహాలు పులులు చిరుతలు ఎలుగుబంట్లు లాంటి క్రూరమృగాలే కాక భారీశరీరాలు కలిగిన మదపుటేనుగులు సహితం మనిషి కొరడా ఝులిపిస్తే పంచప్రాణాలు అరచేతిలో పెట్టుకుని గడగడలాడుతున్నాయి. అంటే చివరికి జ్ఞానం లేని పశుజాతి సహితం చిరుప్రాయం నుండి ఇచ్చే తర్ఫీదు ద్వారా మనిషికి ఊడిగం చేస్తుంది. మన పిల్లల విషయంలో కూడా అంతే. మనం ఆశించిన ఫలితం కావాలంటే కాలాన్ని వృధా చేయకుండా సకాలంలో జరిపిన విద్యాభ్యాసం మొదలుకొని వారిలో క్రమశిక్షణకు జ్ఞాపకశక్తికి మేధస్సుకు పదును పెట్టాలి. మేధావిగా శాస్త్రజ్ఞుడిగా ఇంజనీరుగా డాక్టరుగా ఉత్తమ పౌరుడిగా తీర్చిదిద్దాలి.

భూతకాలమును దృష్టియందుంచుకుని
వర్తమాన కాలమును సద్వినియోగపరుచుకుంటూ
భవిష్యత్ కాలానికి బాటవేయాలి
ప్రగతిని సాధించాలి.

# విశ్వాసము

సృష్టిలో విశ్వాసము ఎంతో గొప్పది. విశ్వాసము మనోధైర్యాన్ని అనంతశక్తిని ప్రసాదిస్తుంది. చెరువులో మునిగిపోతున్న చీమ ఆర్తనాదం విన్న పావురము ఆకు వేసి చీమను రక్షించిన కథ మనకు తెలుసు, ఆ విశ్వాసమే పావురపు ప్రాణాలను కాపాడింది. కలుగులో నివసించే ఎలుక విశ్వాసమే వలలో చిక్కుకున్న సింహాన్ని విముక్తి చేసింది. రామునిపై వున్న విశ్వాసమే హనుమంతుడిని సముద్రాన్ని దాటించింది. ఏకలవ్యుడి విశ్వాసమే విలువిద్యలో ప్రావీణ్యతను సమకూర్చింది.

విశ్వాసము కోల్పోయిన ఏ ప్రభుత్వము నిలువలేదు ప్రభువుకు స్థానముండదు. ఆత్మవిశ్వాసముతోనే మహాత్మా గాంధీగారు స్వాతంత్ర్య సమరశంఖాన్ని వూదాడు. ఆయనపై వున్న విశ్వాసముతోనే భారతప్రజలు ఆయనను అనుసరించారు. పలు ఉద్యమాలలో పాల్గొన్నారు లాఠీదెబ్బలు తిన్నారు జైలుశిక్ష అనుభవించారు. ఆత్మవిశ్వాసముతోనే అల్లూరి సీతారామరాజు బ్రిటీషు ప్రభుత్వాన్ని గడగడలాడించాడు. ఆత్మవిశ్వాసంతోనే భగత్‌సింగ్ ఉరికంబాన్ని సహితం లెఖ్ఖ చేయలేదు.

విశ్వాసం పట్టుదలను పెంచుతుంది కార్యదీక్షకు కంకణం కడుతుంది మనోధైర్యానికి మార్గం చూపుతుంది. చంటిపిల్లలు వాళ్ళు కోరుకున్నది సాధించడానికి పట్టు బట్టి ఏడుస్తారు మారాము చేస్తారు తల్లిదండ్రుల మెదడు పని చేయని పరిస్థితి కల్పిస్తారు చీవాట్లు పడతారు దెబ్బలు తింటారు అయినా పట్టు వదలరు. చివరికి విసిగి వారి కోరిక నెరవేర్చక తప్పదు. అప్పటినుం వాళ్లలో ఆత్మవిశ్వాసము పెరుగుతుంది. ఏ మార్గం అవలంబిస్తే తల్లిదండ్రు వింటారో వారికి క్షుణ్ణంగా తెలిసిపోతుంది. కార్యసాధనకు పట్టు ఆత్మవిశ్వాసమే కారణమన్న విషయం ఆలోచనారహితంగా బాల్యంలోనే చా

చేసుకుంటుంది. వారిలో వున్న ఆత్మవిశ్వాసాన్ని పెద్దలు గుర్తెరిగి సవ్యమైన మార్గంలో పెట్టగలిగితే విద్యార్థి దశలో పట్టుదలతో ఆత్మవిశ్వాసముతో దృఢమైన సంకల్పంతో విద్య నభ్యసించగలరు. సునాయాసముగా వారి వారి తరగతుల్లో ఉత్తమశ్రేణిలో కృతార్థులు కాగలరు. దానితోపాటు గురువుల యెడల తల్లిదండ్రుల యెడల విశ్వాసము పెరుగుతుంది.

యువతలో ఆత్మవిశ్వాసమే కార్యదీక్షను పెంచుతుంది. వైజ్ఞానిక రంగములో పరిశోధన రంగంలో పారిశ్రామిక రంగంలో వ్యాపార రంగంలో ప్రగతిని చూపుతుంది. దైవభక్తిని పెంచుతుంది. మనం ప్రతిరోజు పత్రికల్లో చూస్తూనే వున్నాం. స్వామివారి హుండీలో వేస్తున్న లక్షల కరెన్సీలు కిలోల కొద్దీ బంగారం భగవంతుని యెడల భక్తునికి గల ప్రగాఢ విశ్వాసమే కానుకల సమర్పణకు దోహదపడుతుంది.

మనం ఏ పని చేయతలపెట్టినా చిత్తశుద్ధి, ఆత్మశుద్ధి లేనిదే విశ్వాసము ఉద్భవించదు. అందుకే యోగి వేమన

ఆత్మశుద్ధి లేని ఆచారమది యేల
బాండశుద్ధి లేని పాకమేల
చిత్తశుద్ధి లేని శివపూజలేలరా
విశ్వదాభిరామ వినురవేమ.

అంటే మనసు పవిత్రంగా వుంచుకోలేని ఆచారము అపచారమే - శుభ్రంగా లేని పాత్రల్లో వండిన వంట విషంతో సమానం. నిజాయితీ లేని పూజలు నిజంగా వేషాలే అవుతాయి - ఆచారాలు సాంప్రదాయంగా వచ్చేవి. వాటిని గుడ్డిగా అనుసరించడం గాదు. అవి ఏ పరమార్థముతో ఉద్దేశించబడ్డాయో తెలుసుకుని నడవాలి అన్నాడు వేమన.

భార్యాభర్తల మధ్య అవగాహన - తల్లిదండ్రుల పిల్లల మధ్య అవగాహన లేకపోతే, విశ్వాసాలను కోల్పోతారు ఆత్మసంఘర్షణలు బయల్దేరుతాయి బాంధవ్యాలు విస్మరిస్తారు మానసిక వవేదన మొదలలౌతుంది. కొన్ని కొన్ని సమయాలలో ఉన్మాదం కూడా చోటు చేసుకుంటుంది. జీవితాలలో అగాధం అంధకారము ఏర్పడుతుంది. జీవితలక్ష్యానికి కారు మేఘాలు కమ్ముకుంటాయి.

మేఘమడ్డమైన మిహిరుని చెరుచును
చిత్తమడ్డమైన స్థిరము చెరుచు
మరపు లడ్డమైన మరి ముక్తి జెరచును
విశ్వదాభిరామ వినురవేమ.

ముసిరిన మబ్బులు సూర్యకాంతిని అడ్డుతాయి. వ్యామోహం జనిస్తే స్థైర్యం చెడుతుంది. చైతన్యరహితమైన జడస్థితి వచ్చి బయటపడే మార్గం తెలియదు. సత్యం చైతన్యం సూర్యుని వంటివి. వాటిని అజ్ఞానం చాంచల్యం కప్పివేయకుండా చూసుకొమ్మని హెచ్చరిస్తున్నారు వేమన.

విశ్వాసం కోల్పోయిన నాడు అజ్ఞానం చోటు చేసుకుంటుంది అంధకారము ఆవరిస్తుంది.



# శ్రేయోభిలాషి

పుట్టడంలో చావడంలో మానవులు సమానులే కాని బతకడంలో ఎందుకు అసమానులు. ఈ తేడాలు ఎక్కడి నుండి వచ్చాయి. ఆర్థి అసమానతలు ఏర్పడ్డాయి. విశ్లేషించి సర్వమానవ సమానత్వాన్ని బోధించి ప్రజాకవి వేమన

నీతి తెలియజెప్ప నిజముగ వేమన
పాతకములనెల్ల పారబట్టి
లోతు తత్త్వ మరసి లోకులకును జెప్పె
విశ్వదాభిరామ వినురవేమ.

మనకోసం మన సాంఘిక ప్రయోజనం కోసం పురాణ కాలం నుండి ఎందరో మహానుభావులు నీతి ధర్మాలను బోధిస్తూ వస్తూనే వున్నారు. భగవద్గీ విధుర నీతి మొదలుకుని వేమన యోగి వరకు అడుగడుగున మన నైతి బాధ్యతలను మనకు గుర్తు చేస్తూ, వెన్ను తడుతూ వున్నారు.

విదురుని ఉవాచను సర్వవేళల మనం మననం చేసుకుంటే మన జీవ విధానంలోనే గొప్ప మార్పుని గమనించవచ్చు.

ఏ మానవుడు మనతో ఏ విధముగ ప్రవర్తించునో, ఆ విధముగా మనము వారితో మెలుగుట మంచిది. కపట ప్రవర్తన గలవానితో కపటముగన సాధుప్రవర్తన గలవానితో సాధుభావముతోనే మెలగవలెను అని చెప్పూ, మ ప్రవర్తన మనకు సమకూర్చెడి లాభనష్టాలను తెలిపాడు.

వార్ధక్యము శరీర సౌందర్యమును ఎట్లు నష్టపరుచునో, ఆశ ధైర్యమున సడలించును, మృత్యువు ప్రాణములను హరించును. అసూయ ధర్మాచరణమును తగ్గించును. కామము సిగ్గును తీసివేయును, నీచుల సే సత్ప్రవర్తనను, క్రోధము సంపదను నష్టపరచగా గర్వము లేక దురభిమానమ సర్వస్వమును నశింపజేయును అని బోధించాడు.

అతిగర్వము, అతి కటు భాషణము, లోభము, క్రోధము, తన కడుపే కైలాసమని తలంచుట, మిత్రద్రోహము - ఈ పదునైన ఆరు కత్తులు మానవుని ఆయుష్షును నరికివేయును.

పెద్దల ఆజ్ఞను శిరసావహించువాడు, నీతిజ్ఞుడు, దాత, దేవతలకు అతిథులకు నివేదన చేసి భోజనము చేయువాడు, ఇతరులను హింసించనివాడు, అనర్థకార్యములకు దూరముగ వుండువాడు, కృతజ్ఞుడు, సత్యవాది, కోమల స్వభావము కలవాడు, ఉదారస్వభావము గల విద్వాంసుడు - వీరు ఇహ పరలోక సుఖములకు యోగ్యులనే భావన వ్యక్తపరచాడు.

ఆ విధముగానే ధనము ఇచ్చి పుచ్చుకొను వ్యవహారములలో చిక్కులను విశదపరచినాడు. ప్రభువు, వ్యభిచారిణి యగు స్త్రీ, రాజసేవకుడు, పుత్రుడు, సోదరుడు, చిన్నబిడ్డలు గల విధవ, సైనికుడు సర్వస్వమును పోగొట్టుకున్న వారికి ఇచ్చిన ధనము తిరిగి రాకపోవచ్చును అంటాడు.

ధనము వలెనే కొందరికి ఆశ్రయము ఇచ్చినను మంచికి బదులు చెడు చేసిన వారమగుదుము. ఏ పని చేయని సోమరికి, తిండిపోతుకి, అందరితో వైరము పెట్టుకొనెడి వారికి, గొప్ప మోసగాడికి, హింసించే స్వభావము కలవారికి దేశకాల జ్ఞానము లేనివాడికి, నిందిత వేషధారికి సహకరిస్తే నిష్ప్రయోజన మంటాడు.

మనకు యెంతటి కష్టము వచ్చినను కొందరి సహకారమును కోరగూడదని సెలవిచ్చాడు. లోభి, ఇతరుల గురించి చెడు చెప్పువాడు, మూర్ఖుడు, అడవిలో నివసించువాడు, ధూర్తుడు, నీచులను సేవించువాడు, క్రూరుడు, వైరము పెట్టుకొనువాడు, కృతఘ్నుడిలాంటి స్వభావము గలవారి పొందు కోరకూడదంటాడు. కర్మఫలితములకు ఆధారము కర్మసాధనములు - కర్మసాధనములకు ఆధారము కర్మఫలితములు. ఈ రెండు పరస్పర ఆశ్రయులు.

కాలము ఎంతో వేగంగా గడుస్తూ వుంది. మానవుడి మేధస్సు అంతకు ఎన్నో రెట్లు వేగంతో పరుగులు తీస్తూవుంది. ఈ పరుగు పందేలలో మనిషి ఉనికి మర్చిపోతున్నాడు. ఎన్నో అనర్థాలకు గురి అవుతున్నాడు. సత్ప్రవర్తన వలననే అందరి దీవెనలను, ఆశీస్సులను పొందగలుగుతాము.

సత్ప్రవర్తనతో సంక్రమించిన మంచితనమే మనకు చివరికి

దక్కుతుంది. అది తెలిసి వేమన అంటారు

తల్లి గర్భమందు దాబుట్టినప్పుడు
మొదలు బట్టలేదు తుదకు లేదు
నడుమ బట్ట కట్ట నగుబాటు కాదొకో
విశ్వదాభిరామ వినురవేమ.

బట్టలు కట్టడము అంటే వేమన దృష్టిలో ఆడంబరం, అహం అనుకోవడం, నిర్మలమైన మనస్సు మనిషిని పవిత్రంగా ఉంచుతుంది అని వారి భావన.

అందుకే నీతిని విడవద్దు, దైవభక్తి మరువవద్దు, యెదుటి మనిషిలో దైవాన్ని చూడాలి.

ళ్ళ

# అహింస

అహింస అనేది ప్రపంచంలో అతి శక్తివంతమైన ఆయుధమని బాపూజీ నిరూపించాడు. అహింసా ఆయుధముతోనే భారతమాత సంకెళ్లను త్రెంచాడు భారతప్రజలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యాలను ప్రసాదించాడు.

వర్ణవ్యవస్థకు వ్యతిరేకంగా దక్షిణాఫ్రికాలో సాత్విక పోరాటం ప్రారంభించిన గాంధీజీ తన కార్యరంగాన్ని భారతదేశానికి మార్చాడు. “నన్ను సరయిన సమయానికే భగవంతుడు పంపించాడు” అనుకొన్నారు గాంధీజీ.

భారతదేశములో ఎన్నో రకాల మతాలున్నాయనీ, ఒక మతంలోనే ఎన్నో కులాలు వున్నాయనీ, ఒకే కులంలోనే ఎన్నో అంతర్యాలున్నాయనీ గాంధీజీకి తెలియని విషయం కాదు. అయితే తనకు తెలిసిన ఈ విషయాన్నే దక్షిణాఫ్రికా నేపథ్యంలో పునఃపరిశీలన చేసి గాంధీజీ ఆశ్చర్యపోయాడు.

“స్వాతంత్ర్యం స్వేచ్ఛ అవసరమే! ఈ రెండూ అమూల్యమయినవి. వీటిని శక్తిసంపన్నులు మాత్రమే కాపాడుకోగలుగుతారు. ఈ శక్తి సమైక్యత ద్వారా సిద్ధిస్తుంది. మతాలుగా కులాలుగా శాఖలుగా చీలిపోయి దుర్భర స్థాయిలో ఉన్న జాతి, ఏ స్వేచ్ఛ నిలుపుకోలలేదు” అంటారు గాంధీజీ.

నువ్వే స్వేచ్ఛను కోరుతున్నావో అదే స్వేచ్ఛను నువ్వు మరొకరికి నిరాకరిస్తున్నప్పుడు నైతికంగా నువ్వు దిగజారిపోయినట్లే లెక్క. అల్లాగే పతనమయి పోయినవారు స్వేచ్ఛను కోరడాన్ని నేను సమర్థించను అంటారు గాంధీజీ.

సజ్జనుడైన మహాత్ముని అడుగుజాడలలో భారతప్రజ నడవడము వలనే అహింసా ఆయుధంతో స్వాతంత్ర్యాన్ని పొందగలిగింది.

నీచ గుణములెల్ల నిర్మూల మొనరించు
కొదవలేదు సుజన గోష్ఠి వలన
గంధమలద మేని కంపడంగిన రీతి
విశ్వదాభిరామ వినురవేమ.

అని సెలవిచ్చాడు యోగి వేమనగారు. అంటే గంధం రాసుకుంటే చెమట కంప పోయినట్లుగా సుజనులతో సహవాసం చేసి వాళ్ల మాటలు వింటే నీచగుణాల మెల్లగా నిర్మూలమవుతాయి, సజ్జన మైత్రి వలన లోపమేమి ఉండదు "సత్సంగతాని నిధనాస్యపి కారయంతి" అని ఆర్యోక్తి మంచివారి తోడి మైత్రి మరణాన్ని కూడా తృప్తినిస్తుందని దీని అర్థం.

అహింసా మార్గంలో పయనించి కూడా ఎందరో మహనీయులు తవ ప్రాణాలను ఫణంగా అర్పించి మన భారతజాతికి విముక్తి ప్రసాదించారు.

ఒక చెంప కొడితే వేరొక చెంప చూపు, ఎదుటి వాడిలో మార్పు వస్తుంది, దాని వెనువెంటనే తప్పక పశ్చాత్తాపం వుంటుంది అనేది మార్గం.

సాత్విక గుణం గురించి వేమన మరో భాష్యం చెప్పారు.

కోటి దానం ఇచ్చి కోపంబు పొందినా
సాటి సేయరతని ప్రజలు మెచ్చి
సాత్విక గుణములను సర్వజ్ఞుడౌనయా
విశ్వదాభిరామ వినురవేమ.

విద్యాదానమే కాదు విత్తం కూడా కోట్ల కొలది దానం చేసినవాడ కోపం తెచ్చుకోకూడదు. కోట్లకొలది దానం చేసినవాడైనా సరే కొద్దిగా కసరిన చాలు ప్రజలు అతనిని మెచ్చుకోరు. అందుకే తామస గుణాలలో ఒకటైన కోపాన్ని విడిచిపెట్టాలి.

అహింస, అస్తేయము, సత్యము, శౌచము, బ్రహ్మచర్యము, ఇంద్రియ నిగ్రహము, అక్రోధము, అసూయ అను ఎనిమిది సాత్విక గుణాలు.

హింసాత్మక చర్యలు మానాలి. తాత్కాలికముగా మనం ఏదో సాధిస్తున్నామని హింసకు పాల్పడితే శాశ్వతమైన వైషమ్యాలు పెరుగుతాయి పతనానికి దారి తీస్తాయి. అహింస వలన ప్రేమ పుడుతుంది. ఆప్యాయతలు అనురాగాలు చోటుచేసుకుంటాయి. మనోబలం పెరుగుతుంది. నిర్మలమైన జీవనంతో పాటు ఆయురారోగ్యాలు ప్రాప్తిస్తాయి.



# సత్యాగ్రహం

పట్టరాని పట్టు పట్టియుండెడివాడు
పుడమిలోన కీర్తి పొందలేడు
సుగుణ లక్షణమున సుజ్ఞాని యౌనయా
విశ్వదాభిరామ వినురవేమ.

చెయ్యకూడని శపథం చేయడం మొండితనం. దానివల్ల కీర్తి రాదు, పైగా అపకీర్తి వస్తుంది. అశ్వద్ధామ అపాండవం చేస్తానని పంతం పట్టి నిద్రపోతున్న వాళ్ల కుత్తుకలు కోశాడు. అది క్రూరులూ, కుమతులు చేసే పని. సుగుణవంతులు చేసే పనికాదు. సుగుణ లక్షణాలు వల్లనే సుజ్ఞానం అబ్బుతుంది.

సత్యాగ్రహంలో ఉన్న శక్తి మనకు నిత్యమూ ఉపయోగకరమైనది. సత్యాగ్రహమంటే సత్యాన్ని అంటిపెట్టుకొని వుండటమే సత్యాగ్రహం. మన సమస్త జీవితాన్ని సత్యాగ్రహ నిష్ఠకు అనుకూలముగా మలచుకోవడమే. ఎన్ని కష్టాలు వచ్చినా మనం సత్యం అనుకున్న దానిని వదిలి పెట్టకపోవడము, ఇవే సత్యాగ్రహ లక్షణాలు. సత్యాన్ని గురించి ఎన్ని కష్టాలు అనుభవించవలసి వచ్చినా సరే, మనము కష్టాలను ఎదురుకుంటున్నామనే భావన కూడా ఉండకూడదు. సత్యాన్ని అమలులో పెట్టేవాడికి తన ప్రయత్నంలోనే ఆనందం లభిస్తుంది.

ఈ విధంగా కష్టాలలో కూడా సత్యాన్ని అంటిపెట్టుకొని ఉండగల శక్తి ప్రజలలో ఏర్పడాలి. ఈ శక్తి వల్లనే ప్రపంచం హింసాముఖం నుండి తప్పించుకోగలదు. ఏ సమాజంలోనైనా ఎలాంటి సమస్యలున్నా సరే వాటిని పరిష్కరించుకోవడానికి ఈ సాధనాన్ని ఉపయోగించుకోవచ్చు. (విద్యార్థులలో సత్యాగ్రహ శక్తిని పెంపొందించే విద్యావిధానాన్ని మన విద్యావేత్తల రూపొందించాలి)

ఒక దేశం అన్యాక్రాంతమైనపుడు ఆ దేశప్రజలు పరాయి ప్రభుత్వా

జోహార్లు చెపుతూ అణగి మణగి పడివుంటారు, లేకపోతే ఏదో ఒక విధమైన విప్లవం ప్రారంభిస్తారు. పరాధీనులైన ప్రజలు చేయగలిగినవి ఇవి రెండే పనులు కాని భారతదేశములో ఇందుకు భిన్నంగా జరిగింది. ఆంగ్లేయుల పరిపాలన కాలములో ఈ దేశంలో పుట్టిన మహాపురుషులు అణగి మణగి ఉండటానికి ఒప్పుకోలేదు. విప్లవం చేయటమూ వారికి ఇష్టము లేదు. వారు ఆత్మపరిశోధన చేసుకోవడము ప్రారంభించారు. ఇంత ప్రాచీనమైన, మహత్తరమైన సంస్కృతీ-సభ్యతలు కల దేశం, ఇంత విశాల దేశం పరాధీనం ఎలా అయిపోయిందా అని వారు ఆలోచించసాగారు. మనలో ఉన్న దోషాలను పరిష్కరించుకోవాలన్న ఆత్మశుద్ధితో ఉద్యమం ప్రారంభమైంది. మనవారు ఆధ్యాత్మిక మార్గాన్ని అనుసరించారు.

ప్రపంచంలో ఇటువంటి విలక్షణమైన పరిష్కార మార్గం ఎక్కడా కనిపెట్టబడలేదు. ఆ యుగంలో రాజారామమోహనరాయ్, రామకృష్ణ పరమహంస, వివేకానందుడు, స్వామి దయానంద, రమణ మహర్షి, అరవిందుడు, తిలక్ రానడే, రవీంద్రనాధుడు, మహాత్మాగాంధీ మొదలైన అనేకమంది తత్త్వవేత్తలు పుట్టారు. వారు స్వతంత్రబుద్ధితో ఆలోచించారు. ప్రపంచంలో పరతంత్రమైన ఏ దేశంలోనూ ఈ విధంగా తత్త్వవేత్తలు పుట్టలేదు. పుట్టినా వారు తమ స్వతంత్ర్యాలోచనలతో సమస్త ప్రపంచాన్ని ప్రభావితం చేయలేదు. పరతంత్రమైన భారతదేశం తన స్వతంత్రమైన ఆలోచనాశక్తితో ప్రపంచానికి సందేశాలనిచ్చింది. సర్వమత సమన్వయం అనేది కేవలం మాటలలోనే కాక అనుభవాత్మకంగా అమలు పరచి చూపించారు రామకృష్ణ పరమహంస. సర్వమతాల్లోనూ మంచి అనేది ఉన్నదని ఉపన్యాసకులు చెప్తూనే ఉంటారు, రచయితలు వ్రాస్తూనే ఉంటారు. కాని ఆయా మతాల్లోని మంచి-చెడుగులను నిష్పాక్షికమైన బుద్ధితో పరిశీలించి, వాటి మూలతత్త్వాలను మధించి, ఆత్మనిర్ణయం చేసి "అన్నిటికీ మూలం ఒకటే ప్రపంచమంతా అద్వైత మూలకం" అని చెప్పగలగటం గొప్ప విశేషం. ప్రపంచానికి భారతదేశమిచ్చిన అమూల్యమై కానుక - అద్వైత భావన. మనము సంకుచిత భావాల నుంచి పైకిలేచి. పరమాత్మ రసాన్ని సేవించి, ప్రజాసేవ చేయడానికి క్రిందికి దిగాలి. పరమాత్మ రసాస్వాదన చేస్తే తప్ప వ్యక్తి నిజంగా మానవసేవ చేయలేడు. ఇది అరవిందుడు సమర్పించిన కానుక. మనస్సును జయించాలని, నిర్మూలించా

లని, వేల సంవత్సరాల నుండి అంటూనే యున్నారు. కాని సమస్త మానవులు, సంకుచిత మానసిక పరధులను దాటకల్గిన నాడే మానవజాతి ఉద్ధరించబడగలదని అరవిందుడు చెప్పినాడు.

మనము సంకుచిత భావాల నుంచి పైకిలేచి పరమాత్మ రసాన్ని సేవించి, ప్రజాసేవ చేయటానికి క్రిందికి దిగాలి. పరమాత్మ రసాస్వాదన చేస్తే తప్ప వ్యక్తి నిజంగా మానవసేవ చేయలేడు. ఇది అరవిందుడు సమర్పించిన కానుక. మనస్సును జయించాలనీ, నిర్మూలించాలనీ వేల సంవత్సరాల నుండి అంటూనే ఉన్నారు. కాని సమస్త మానవులు సంకుచిత మానసిక పరిధుల్ని దాటగలిగిన నాడే మానవజాతి ఉద్ధరించబడగలదని అరవిందుడు చెప్పాడు.

సత్యాగ్రహ భావన గాంధీగారు సమర్పించిన అమూల్యమైన కానుక. పరస్పర వ్యతిరేక భావాలను పరిష్కరించడానికి, యుద్ధము, హింస మొదలగు సాధనాలను త్యజించేవరకూ ప్రపంచంలో సుస్థిర శాంతి ఏర్పడదు. దానికి సత్యాగ్రహమే ఉత్తమ పరిష్కార మార్గము.

గాంధీగారు దక్షిణాఫ్రికాలో మొట్టమొదటి సారిగా సత్యాగ్రహాన్ని సామూహిక రూపంలో ప్రయోగించారు. సత్యాగ్రహమనే పదం కూడా అక్కడే ఉద్భవించింది. అంతకు పూర్వం దక్షిణాఫ్రికాలో ఉద్యమాన్ని "నిరాయుధ ప్రతీకార"మని పిలిచేవారు. కాని ఇది ఆ ఉద్యమానికి సరియైన పేరు కాకపోవుటచే సత్యాగ్రహమనే పదాన్ని సృష్టించారు.

పట్టు పట్టరాదు పట్టి విడువరాదు
పట్టెనేని బిగియ పట్టవలయు
పట్టు విడుట కన్న పడి చచ్చుటే మేలు
విశ్వదాభిరామ వినురవేమ.

ఒక పంతం పట్టే ముందు, ఒక దీక్ష స్వీకరించడానికి పూర్వం, ఒక ఆదర్శానికి అంకితమవడానికి ఆ పంతం తగునా? ఆ దీక్ష అవసరమా? ఆ ఆదర్శం సత్యమైనదేనా? అనే విచక్షణ అవసరం. అటువంటి విచక్షణ లేకుండా పట్టు పట్టరాదు. విచక్షణయోగ్యమైనదని తేలాక దానిని పట్టుకొని ఉండాలి. ఎంతమాత్రం పట్టు విడువకూడదు. మధ్యలో వచ్చే అంతరాయాలకు, అపాయాలకు, ప్రలోభాలకు లోనై పట్టిన పట్టు విడవడం కన్నా పడి చావడమే మేలు. మానుషం ఉన్నవాడు అసువులైనా అర్పిస్తాడు గానీ ఆదర్శాన్ని విడలేడు.

అయితే పట్టిన పట్టు ప్రజాక్షేమానికి తోడ్పడాలి అంటాడు వేమన.

గాంధీగారి కాలంలో ఉన్నట్లుగా, ~~ఈ~~నాడు సత్యాగ్రహరూప
ఉండడానికి వీలులేదని మనం గ్రహించాలి. గాంధీగారి కాలానికి నేటికి చాల
భేధం ఏర్పడింది. ఆనాడు మనం స్వాతంత్ర్యులం కాము. ఆ రోజులల
భారతదేశంలో ప్రజాతంత్రం ఏర్పడలేదు. ప్రస్తుతం ప్రజాతంత్ర శాసన వ్యవ
ఏర్పడింది. ఆనాటి విజ్ఞాన సంపత్తి కంటే నేడు ఎన్నో రెట్లు అధికంగా విజ్ఞా
సంపద ఏర్పడింది. కనుక సత్యాగ్రహ పరిశోధనను మనం ఇంకా అభివృ
చేయాలి, సత్యాన్ని కాపాడాలి.

# వయోజన విద్య

ఈ భూమిపై వున్న సకల చరాచర ప్రాణకోటిలో మానవుడు విజ్ఞానం, వివేకం కలిగి దినదినాభివృద్ధిని కాంక్షించే ప్రాణి. తొలి మానవ చరిత్ర ఆటవిక దశ నుండి అణు యుగదశ వరకు మనకు మానవాభివృద్ధిలోని వివిధ దశలను చరిత్ర చెబుతూనే వుంది. ఈనాటి మన యీ అభివృద్ధికి కారణం, మనం విజ్ఞానాన్ని నిక్షిప్తం చేసి ముందు తరాలకు అందించే విధానం. ఆదే విద్య ఆనేది జగమెరిగిన సత్యం. అందుకే విద్య లేనివాడు వింత పశువు అనే నానుడి బలంగా చోటు చేసుకుంది.

మనది వ్యవసాయిక దేశం. అందులో గ్రామాలు కొల్లలుగా వున్న సువిశాల భారతం. కుల, మత ప్రాతిపదికపై ఏర్పడిన సమాజం - జమీందారి ఫ్యూడల్ వ్యవస్థ, సామాన్య మానవునికి విద్యను అందుబాటులో వుండకుండా తమ అధికారాన్ని, దర్పాన్ని కాపాడుకొనుటకు కృషి చేశాయి.

ప్రతి మనిషి చదవడము, వ్రాయడము నేర్చుకోవాలన్నది నేటి మన ప్రజాస్వామ్య ప్రభుత్వ ప్రధానధ్యేయం. అందుకే అనియత, వయోజన విద్యలను ప్రవేశపెట్టి కృషి చేయడం జరుగుతూ వుంది.

వయోజనులను చైతన్యీకరణ ద్వారా వారిలో జాగృతి లేదా సామాజిక స్పృహ, ప్రేరణ కలిగించాలి, వారిలో ఉన్నటువంటి సృజనాత్మక శక్తిని పెంపొందిస్తే వారి శక్తియుక్తులను జాతీయ నిర్మాణాత్మక కార్యక్రమంలో చురుకుగా పాల్గొనేటట్లు చేయవచ్చు. చైతన్యీకరణ ద్వారా దారిద్రరేఖకు దిగువన నివసిస్తూ దుర్భరమైన జీవితాన్ని గడుపుతున్న బలహీన వర్గాల మూగజీవులను వారి మూగ సంస్కృతి నుండి వెలికి తీసి వారికి జాతీయ జీవనంలో పాలుపంచుకునే అవకాశము కల్పించవచ్చు. చైతన్యీకరణ ద్వారా నిద్రాణమైన జాతిని జాగృతి చేసే అవకాశము వున్నది.

వయోజనులు నిరక్షరాస్యులు అయినప్పటికీ వారికి జీవితానుభవం

ఉంటుంది. అట్టి వయోజనుల అవసరాలకు, దైనందిన జీవితాలక ఉపయోగపడేటట్లు విద్య నేర్పవలెను. వయోజనులు వ్యవహారికంగా భిన్న వృత్తులకు చెందిన అనుభవము, విభిన్న మానసిక ప్రవృత్తి కలిగినట్టివారు. వారికి ఆసక్తి కలిగించే విధంగా అనియత పద్ధతుల ద్వారా విద్య నేర్పవలెను.

విద్య వ్యక్తి వికాసానికే కాక మానవునిలోని సృజనాత్మక శక్తి యుక్తులను పెంపొందించి జాగృతిని కలిగిస్తుంది. వ్యక్తి తన పరిసరాలకు అవసరాలకు అనుగుణంగా బాధ్యత గల పౌరులుగా వ్యవహరిస్తూ ప్రభుత్వ అభివృద్ధి కార్యక్రమాలలో పాల్గొనేట్లు, సమసమాజాభివృద్ధికి తోడ్పడేట్లు విద్య రూపొందించగలదు.

ప్రభుత్వం గ్రామీణ పునర్నిర్మాణం కింద వయోజన విద్యకు ప్రాధాన్యమిస్తూ 15 నుంచి 35 సంవత్సరముల మధ్య వయస్సు గలిగిన యువతీయువకులను అక్షరాస్యులుగా చేసి వారి వారి వృత్తులలో ప్రావీణ్యతను, సామాజిక చైతన్యమును కలిగించే ఉద్దేశంతో జాతీయ వయోజన విద్యాకార్యక్రమాన్ని దేశమంతటా చేపట్టి దృఢసంకల్పంతో నిర్వహించవలయును.

స్వాతంత్ర్యానంతరం దేశంలో ఇతర అభివృద్ధి రంగాలలో సాధించినంత అభివృద్ధి అక్షరాస్యత విషయంలో సాధించలేకపోయాం. కారణం విద్యకు ఇవ్వవలసినంత ప్రాముఖ్యం ఇవ్వకపోవడమే. ఉదాహరణకు అంతగా అభివృద్ధి చెందని ఆఫ్రికా దేశాల్లో కొన్ని విద్యపై 6 శాతం నిధులు ఖర్చు పెడుతుంటే మన దేశంలో కేవలం 4 శాతం నిధులు వెచ్చిస్తున్నాం. అభివృద్ధి చెందిన దేశాలలో విద్యపై 9 నుంచి 10 శాతం దాకా ఖర్చు చేస్తున్నారు.

స్వాతంత్ర్యానంతరం విద్యారంగంలో కొంత కృషి జరిగింది. సార్వజనీన విద్యావ్యాప్తికి ప్రభుత్వపరంగా కృషి జరిగింది. మన రాజ్యాంగ రచన చేసేటప్పుడే 10 సంవత్సరాల కాలంలో బాలబాలికలందరికీ ప్రాథమిక విద్య అందించాలనే లక్ష్యాన్ని మనకు మనమే నిర్దేశించుకున్నాం. కానీ ఈ లక్ష్య సాధనలో దాదాపు మూడు దశాబ్దాలు వెనుకబడి వున్నాం. మన దేశ జనాభాలో 35 శాతం ప్రజలు 15-35 సంవత్సరాల మధ్య వయసువారు. వీరే దేశంలో ఉత్పత్తి రంగంలో ప్రధాన భాగస్వాములు. వీరే దేశంలో పటిష్టమైన వెన్నెముక ఇటువంటి యువతలో నిరక్షరాస్యత పెరిగి, దేశ సమస్యలను అవగాహన చేసుకోలేని పరిస్థితిలో వారు వుండటం చాలా ప్రమాదకరమైన, శోచనీయమైన విషయం.

ముఖ్యంగా జాతీయ లక్ష్యాలైన, సార్వత్రిక ప్రాథమిక విద్య, శిశు మరణాలను బాగా తగ్గించడం, పరిమిత కుటుంబాలను కలిగి వుండటానికి సుముఖత కలిగించడం, స్త్రీల స్థితిగతులను మెరుగుపరచడం, దారిద్ర్యాన్ని తొలిగించడం వంటి వాటిని సాధించడానికి, నిరక్షరాస్యతా నిర్మూలన అతి ముఖ్యమైన సాధనం. అందుకే మహాత్మాగాంధీ 'సామూహిక నిరక్షరాస్యత భారతదేశానికి తలవంపులు తెస్తున్న కళంకం - దీన్ని తొలగించి తీరాలి' అన్నారు.

వయోజన విద్యావ్యాప్తి, నిరక్షరాస్యతా నిర్మూలనలో ఇంతవరకు జరిగిన కృషిని పరిశీలిస్తే, కృత నిశ్చయంతో కూడిన రాజకీయ, పరిపాలనాపరమైన సంకల్పం కొరవడిందనిపిస్తుంది. అంతేకాక క్షేత్రస్థాయిలో సరియైన కార్యకర్తలు లభ్యం కాకపోవడం, కార్యకర్తలకు సమగ్రమైన శిక్షణ లేకపోవడం, శాస్త్రీయమైన బోధనాపద్ధతులు, బోధనా విషయం కొరవడటం, అక్షరాస్యతానంతర కార్యక్రమాన్ని నిరంతర విద్యాసాధన సౌకర్యాలను సరిగా ఏర్పాటు చేయలేకపోవడం వయోజన విద్యాకేంద్రాలలో అభ్యాసకుల హాజరు అభివృద్ధి చేయలేకపోవడం మొదలైన లోపాలు నిర్ణయించిన కాలవ్యవధిలో లక్ష్యాలను సాధించలేకపోవడానికి ముఖ్యకారణాలు.

మన దేశంలో అక్షరాస్యత పరిస్థితి చూస్తే అక్షరాస్యతా శాతంలో కొంచెం క్రమమైన పెరుగుదల వున్నప్పటికీ నిరక్షరాస్యుల సంఖ్య కూడా వృద్ధి చెందుతుంది. ముఖ్యంగా స్త్రీల అక్షరాస్యతను పరిశీలిస్తే 75 శాతం స్త్రీలు ఇంకా నిరక్షరాస్యులుగానే వున్నారు. స్వాతంత్ర్యానంతరం 1951 నుండి 81 మధ్యకాలంలో 16.2 కోట్ల నుండి 24.2 కోట్ల వరకు నిరక్షరాస్యులైన స్త్రీల సంఖ్య పెరిగింది. అంతేకాక నిరక్షరాస్యులైన ప్రతి 100 మంది పురుషులకు స్త్రీ నిరక్షరాస్యుల పెరుగుదల 1911లో 105 మంది, 1951లో 114 మంది, 1981లో 232 గాను వృద్ధి చెందుతూ వస్తోంది. 1981 జనాభా లెక్కల ప్రకారం పురుషుల అక్షరాస్యతా శాతం 47 కాగా స్త్రీల అక్షరాస్యతాశాతం 25 మాత్రమే. పట్టణ ప్రాంతాలలో పురుషుల అక్షరాస్యత 66 శాతం, స్త్రీల అక్షరాస్యత 48 శాతం. గ్రామీణ ప్రాంతాలలో పురుషుల అక్షరాస్యత 41 శాతం కాగా స్త్రీల అక్షరాస్యత 18 శాతం మాత్రమే వుంది. ఒక కుటుంబంలో స్త్రీ విద్యావంతురాలైనచో ఆ కుటుంబంలో నిరక్షరాస్యతను తొలగించుటకు ఆ స్త్రీ తోడ్పడగలదు.

నిరక్షరాస్యతా నిర్మూలన కార్యక్రమాన్ని కేవలం ప్రభుత్వ సంస్థ ద్వారానే అమలు పరచి లక్ష్యాలను సాధించడం సాధ్యం కాదు కనుక, సంఘంతో సన్నిహిత సంబంధాలు గల స్వచ్ఛంద సేవాసంస్థలను గుర్తించి వాటికి కావలసిన ఆర్థిక సహాయాన్ని అందించి, వయోజన విద్యాకేంద్రాలు, నిరంతర విద్యాకేంద్రాలను నిర్వహింపచేయాలని జాతీయ అక్షరాస్యతాసంస్థ (NLM ముఖ్య ఉద్దేశ్యం. ఇట్టి స్వచ్ఛంద సంస్థల ద్వారా కార్యకర్తలకు శిక్షణ యేర్పాటు చేయడం, బోధనాంశాల తయారీ, దృశ్యశ్రవణ బోధన పరికరాల ఏర్పాటుతో విద్య నేర్చుకోవడానికి అనువైన వాతావరణం కలిగించాలని నిర్ణయించబడినది

విశ్వవిద్యాలయాలు, కళాశాలల ఉపాధ్యాయులు విద్యార్థులను తగ ప్రోత్సాహాలతో వయోజన విద్యాకార్యక్రమాలలో చేర్చడానికి నిర్ణయించార అంతేగాక సాంఘికాభివృద్ధికి పాటుబడే యువతను, మాజీ సైనికులను, కార్మి సంఘాలను, పారిశ్రామిక సంస్థలను తదితర ఔత్సాహిక వర్గాలను తగ ప్రోత్సాహకాలతో, కావలసిన శిక్షణనిచ్చు వయోజన విద్యాకార్యక్రమమున నిర్వహించి నిరక్షరాస్యతా నిర్మూలన కృషిలో భాగస్వాములుగా చేయడాని సర్వతోముఖ కృషి జరగాలి.

వయోజన విద్యకు సంబంధించిన బోధనాంశాలన మెరుగుపరచడానికి సంబంధిత పరిశోధనాసంస్థల శక్తి సామర్థ్యాలన వినియోగించుకోవడానికి కృషి జరపాలి. భారీ అక్షరాస్యతా కార్యక్రమంలో అక్షరాస్యత, క్రియాశీలక పరిజ్ఞానం, నైపుణ్యాలతో పాటు సాంఘిక, ఆర్థిక వాస్తవాలను కూడా అభ్యాసకులకు తెలియజెప్పడం , దానిని మార్చడానికి గల అవకాశాలను బోధించడం జరుగుతుంది.

ఈ కార్యక్రమానికి ముఖ్య అంశం జనశిక్షణ నిలయం. 1990 నాటి 50,000ల జనశిక్షణ నిలయాలను ఏర్పాటు చేయాలని ప్రతిపాదించడ జరిగింది. ఐదువేల జనాభా గల 415 గ్రామాలకు ఒక నిలయం ఏర్పాటవుతుంధి. వయోజనులు తమ అక్షరాస్యత, గణాంక నైపుణ్యాలన మెరుగుపరుచుకోవడానికి ఈ నిలయాలు సాయంత్రం తరగతులన నిర్వహిస్తాయి. ప్రతి నిలయంలో గ్రంధాలయం, పఠనాలయం, చర్చావేదికలు ఏర్పాటవుతాయి. ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం, సాంస్కృతిక కార్యక్రమాలకై సరళమైన శిక్షణాతరగతులను నిర్వహిస్తాయి. నిజానికి ఇది ఒక సమాచార

కేంద్రముగా రూపొందుతుంది. కార్మిక సంఘాలు, ఇతర ప్రభుత్వేతర సంస్థల ద్వారా నిరంతరం విద్యాబోధన కొనసాగించడం జరుగుతుంది. అంతేకాక ఈ జనశిక్షణా నిలయాలు వారానికి ఒకసారి 3,4 గంటలపాటు ఒక ప్రత్యేక సాయంకాల తరగతులను నిర్వహిస్తాయి. ఆ రోజు తమ వీలును బట్టి అభ్యాసకులు తమకు తోచినంతసేపు ఈ ప్రత్యేక తరగతులకు హాజరయ్యే సదుపాయం వుంటుంది. కరపత్రాలు, పోస్టర్లు వార్తాపత్రికలతో కూడిన ఒక పఠనాలయం కూడ సమకూర్చుతారు.

అక్షరాస్యత కార్యక్రమంలో చదవడం, వ్రాయడం, లెక్కించడం కనీస పరిజ్ఞాన స్థాయిని నిర్ధారించారు. చదవడం భాగంలో అభ్యాసకులు తమకు తోచిన పాఠాన్ని నిమిషానికి 30 పదాలను గట్టిగా చదవలసి వుంటుంది. తమ నిత్యజీవనంలో ఒక సాధారణమైన చేతివ్రాత ప్రతిని చదవగలగాలి. అంటే వీరికి కనీసం ఒక పోస్టుకార్డును చదివే స్తోమత, ఒక మనియార్డరు ఫారాన్ని పూర్తి చేయగల సామర్థ్యం యుండాలి.

జాతీయ స్థాయిలో వయోజన విద్యాకార్యక్రమాన్ని సక్రమంగా అమలు చేయడానికి కావలసిన సాంకేతిక వనరులు సమకూర్చడానికి నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎడల్ట్ ఎడ్యుకేషన్ బాధ్యత వహిస్తుంది. రాష్ట్రస్థాయిలో రాష్ట్రవనరుల కేంద్రాల కార్యక్రమానికి కావలసిన సాంకేతిక సహాయాన్ని, పాఠ్యాంశాల్ని సమకూరుస్తాయి.

జాతీయ అక్షరాస్యత ఉద్యమాన్ని ప్రభుత్వ సంస్థలు ఒక్కటే అమలుపరచటం సాధ్యం కాదు. ప్రజలతో దగ్గర సంబంధాలు గల అనేక సంస్థలు కూడా పాల్గొనాలి. ఈ ఉద్యమాన్ని సమర్ధవంతంగా అమలుపరచడానికి ముఖ్యంగా స్వచ్ఛంద సంస్థలకు అనేక అదనపు అవకాశాలుంటాయి. వ్యవస్థాపరంగా ఇటువంటి కార్యక్రమాలకు అవసరమైన నూతనతను చేకూర్చే ప్రయోజనమే కాకుండా ఈ కార్యక్రమాలకు అంకితమైన పని చేయగల అనుభవజ్ఞులైన కార్యకర్తలు కూడా ఎంతో అవసరము.

మన దేశంలో నిరక్షరాస్యతా నిర్మూలనకు జరిగే ఈ కృషి అంతా కూడా పెరుగుతున్న జనాభాలోను, అక్షరాస్యత పట్ల ప్రజల నిర్లిప్తతను, దృష్టిలో వుంచుకొని చూస్తే హస్తిమశకాంతరంగా గోచరిస్తుంది. ఈ కృషి ఏమాత్రం చాలదనిపిస్తుంది. అందువల్ల ప్రభుత్వపరంగా జరిగే కృషిని, ఇచ్చే ప్రోత్సాహాన్ని

సద్వినియోగపరిచి విద్యావంతులు, చదువరులైన ప్రతి ఒక్కరు నిరక్షరాస్యతను నేటి జాతీయ సమస్యగా అవగాహన చేసుకుని మన దేశాన్ని సంపూర్ణ అక్షరాస్యత సాధించిన దేశంగా చేయడం మనందరి కర్తవ్యం. ఉన్నత విద్యను అభ్యసించే యువతీయువకులు ఒక్కొక్కరు ఒక్కొక్క నిరక్షరాస్యుని అక్షరాస్యున్ని చేయాలనే ధ్యేయంతో కృషి జరిపితే, త్వరలో నిరక్షరాస్యతను నిర్మూలించగలమని ఆశిద్దాం.



# గ్రామీణ సమస్యలు - పరిష్కారం

గ్రామాలు దేశానికి పట్టుకొమ్మలు అన్నారు. మనది ప్రధానంగా వ్యవసాయిక దేశమయినందున గతంలో 80 శాతం ప్రజలకు జీవనోపాధి కల్పించింది వ్యవసాయరంగమే. రానురాను ఈ రంగంలో శ్రమశక్తి వినియోగం తగ్గిపోతుంది. ఎరువులు, విత్తనాలు, క్రిమిసంహారక మందుల ధరలు ఆకాశన్నంటుతుండగా, రైతు పండించిన పంటకు గిట్టుబాటు ధర రావడం లేదు. రైతులపై దళారీల, వ్యాపారుల దోపిడీ ఎక్కువయింది. ప్రకృతి వైపరీత్యాల వల్ల తీవ్రంగా దెబ్బ తింటున్న రైతులకు ప్రభుత్వసాయం అందడంలేదు. ప్రభుత్వం రైతులకు ఋణసౌకర్యం. విత్తనాలు, క్రిమిసంహారక మందులు, ఎరువులు సరఫరా చేస్తున్నప్పటికీ అవేవి సామాన్యరైతుకు చాలినంత అందడం లేదు. వ్యవసాయం వల్ల రైతులకు, రైతుకూలీలకు జీవనోపాధి తగ్గిపోతున్నందున వారు మరో ఉపాధి చూసుకోవాల్సి వస్తోంది.

వైజ్ఞానికముగా నాగరికతలో నేడు ప్రపంచం ఎంతో అభివృద్ధి గాంచినది. యింకా పురోగమనానికి కృషి జరుగుతూనే వుంది. అభివృద్ధి గాంచిన దేశాలలో సామాజిక సమస్యలు తగ్గుతూ పేదరికము నిర్మూలింపబడుతూ వుంది. సమైక్యత, సమిష్టికృషితో స్వార్థాన్ని విడనాడవలసి వుంటుంది. దేశాన్ని. ప్రజల్ని ముందుకు నడపాలంటే, ఆర్థిక సమస్యలను పరిష్కరిస్తూ విద్యాభి చేయవలసి వుంటుంది.

దీనికి ప్రధాన పాత్ర పాలకులది. పరిశీలనాదృష్టి ప్రజలది. ప్రజాస్వామ్యంలో సమాజశ్రేయస్సు ప్రజల చేతుల్లోనే వుంది. ఐదు సంవత్సరముల కొకసారి అభివృద్ధిని బేరీజు వేసుకొని, కొత్తమార్గాన్ని అనుసరించే అవకాశము అరచేతిలోకి వస్తుంది. పరిపాలన ఏ ఒక్కరి హక్కు కాదు కాకూడదు.

జీవిత గమనములో మనిషికి ఎన్నో ఇబ్బందులు, ఒడిదొడుకులు, సమస్యలు ఎదురవుతూ వుంటాయి. సమస్యను పరిష్కరించుకోలేని మనిషి స్వశక్తిని కోల్పోయిన నాడు, దైవశక్తిపై విశ్వాసం పెంచుకుంటాడు. ప్రార్ధనలు చేస్తాడు. ఆపద మొక్కులు మొక్కుతాడు. చెంప దెబ్బలు కొట్టుకుంటాడు. వాగ్దానాలు చేస్తాడు. ముడుపులు కడ్తాడు.

సమాజానికి సరియైన ఆలోచన నిర్ణయం అవసరం. దానికి విద్యాభివృద్ధి వివేకము విజ్ఞానమే ప్రదానమని చెప్పవచ్చు.

దేశజనాభాలో నాలుగింట మూడు వంతుల మంది నివసిస్తున్న గ్రామీణ ప్రాంతాలను పట్టణ ప్రాంతాలతో పోల్చి చూస్తే, అక్కడి ప్రజల తలసరి ఆదాయవ్యయాలు తక్కువ కావడమేకాక విద్య ఆరోగ్యము రవాణా తదితర కనీస సౌకర్యాలు వారికి అంతగా అందుబాటులో లేవనే చెప్పాలి. గ్రామీణ పట్టణ ప్రాంతాల మధ్య అంతరాలు పెరుగుతున్న దృష్ట్యా గ్రామీణాభివృద్ధికి మరింత ప్రాధాన్యత అవసరము.

అందుకే - "నేను మన దేశంలో ఉన్న లక్షల కొలది గ్రామీణుల గురించి ఆలోచిస్తాను. నేను సంతోషంగా జీవించాలనేది, దేశంలోని బీదప్రజలు, అట్టడుగు వర్గాలు సంతోషంతో జీవించడముపై ఆధారపడి వున్నది" అని పూజ్యబాపూజీ అన్నారు. ఒక మనిషి కనీస అవసరాలను తీర్చలేని ఆదాయమే పేదరికం. మన దేశంలో ఎంతమంది పేదప్రజలు వున్నారు అనేది అంచనా వేయుటకు ఆర్థిక శాస్త్రవేత్తలు "పేదరిక రేఖ" అనే అంశాన్ని ప్రవేశపెట్టారు. ప్రణాళికాసంఘం వారు **1984-85** ధరల ప్రకారము దారిద్ర్యరేఖను సగటున తలసరి ఖర్చు నెలకు గ్రామీణ ప్రాంతాలలో **107** రూపాయలు, పట్టణ ప్రాంతాలలో **122** రూపాయలుగా నిర్ణయించినారు. దేశంలో కొన్ని ప్రాంతాలలో వ్యవసాయ రంగంలో ఉత్పత్తి గణనీయంగా పెరిగి, గ్రామీణ సంపన్న వర్గాల సంఖ్య పెరిగినప్పటికి, పేదరికము విద్యా సాంఘిక విషయాలలో వెనుకబడినతనము స్పష్టంగా గ్రామీణ ప్రాంతాలలో కన్పిస్తుంది. మన దేశములో నేడు వున్న ప్రధాన సమస్య గ్రామీణ ప్రాంతాలలో పేదరిక నిర్మూలన. పేదరిక నిర్మూలన అనే అంశము సంపూర్ణమైన, సమగ్రమైన భావన. ఇది ఒక దేశం నుండి మరో దేశమునకు, ఒక రాష్ట్రం నుండి మరో రాష్ట్రానికి మారుతుంది.

గ్రామీణ బీద ప్రజల్లో ఎక్కువమంది భూమి లేని వ్యవసాయదారులు. పేదవారికి సొంత కమతములు లేకపోవడము దారిద్ర్యానికి మొదటి కారణము. భూమి నుండి మరియు శ్రామికుల నుండి తక్కువ ఉత్పాదక శక్తి రావడము. దేశంలో పెరుగుతున్న శ్రామికులకు ఉపయుక్తమైన ఉద్యోగ అవకాశములు గ్రామప్రాంతాలలో తగిన ప్రమాణములో కల్పించకపోవడం.

దేశ ఆర్థిక వ్యవస్థలో భూమిపై ఆధారపడేవారి సంఖ్య పెరుగుతున్న సందర్భములో క్రొత్త ఉపాధి అవకాశములు కల్పించవలసిన బాధ్యత యితర రంగములపై ఆధారపడి యున్నది. ఈ రంగములు ఉద్యోగావకాశములు కల్పించడంలో విఫలమైతే గ్రామీణ రంగములో నిరుద్యోగము ప్రచ్ఛన్నం అవుతుంది. గ్రామీణ పట్టణప్రాంతాల పారిశ్రామిక రంగంలో పెట్టుబడి ఉత్పత్తుల మధ్య ఎక్కువ వ్యత్యాసము ఉండడము. పట్టణ ప్రాంతాలలో పెట్టుబడులు ఎక్కువ స్థాయిలో పెరుగుతున్నాయి. దీనివల్ల గ్రామీణ ప్రజల ఆదాయము పెరుగుటకు ఎట్టి అవకాశము లేదు. ఏవో కొన్ని ప్రాంతాలు తప్ప ఎక్కువ సంఖ్యలో గ్రామీణప్రజలు దారిద్ర్యము, ఆదాయపంపిణిలో అసమానతలు, సరియైన రవాణా సౌకర్యములు లేకపోవడము, అజ్ఞానములో అమానుష పరిస్థితులలో తమ జీవితాలను వెళ్లబుచ్చుతున్నారు.

భారతదేశంలో గ్రామీణ ప్రాంతాభివృద్ధి అనేక సమస్యల వలయంలో వుంది. వ్యవసాయ రంగంలో పని చేయుచున్నవారికి, తక్కువ జీవనాధారము కల్పించుచున్నది. ఇతర రంగములలో ఉద్యోగావకాశములు తగినంతగా లేకపోవుట వల్ల వ్యవసార రంగంపై ఆధారపడే వారి సంఖ్య గణనీయంగా పెరుగుతున్నందువల్ల, వ్యవసాయ రంగం ఈ భారాన్ని మోయలేక పోతున్నది. నిరుద్యోగము పూర్తిస్థాయి ఉద్యోగత లేకపోవడము, శాశ్వతపరమైన పేదరికము గ్రామీణ ఆర్థిక వ్యవస్థను చిన్నాభిన్నము చేస్తున్నాయి. దేశ సాంఘిక, ఆర్థికాభివృద్ధికి ప్రభుత్వం పథకాలను తయారు చేస్తున్నప్పుడు, ఎక్కువ జనాభా గల గ్రామీణ ప్రాంతాలను విస్మరించరాదు.

గ్రామీణ ప్రాంతాలను అభివృద్ధి చేయవలెననెడి ప్రభుత్వ సంకల్పము మన పంచవర్ష ప్రణాళికలలో ప్రతిబింబిస్తున్నది. ఈ కృషిలో భాగంగా అనేక సాధారణ, ప్రత్యేక కార్యక్రమములు ప్రారంభించబడినవి. గ్రామాలలో గల చిన్న సన్నకారు రైతులు, భూమి లేని వ్యవసాయకార్మికులు, చేతివృత్తుల వారు,

వెనుకబడిన తరగతుల వారి యొక్క జీవనస్థితులను మెరుగుపరుచుటకు, అనేక కార్యక్రమములు ప్రారంభించబడినవి. గ్రామీణ దారిద్ర్యాన్ని రూపుమాపుటకు ప్రభుత్వం గత నాలుగు దశాబ్దాలుగా అనేక కార్యక్రమాలను ప్రారంభించినది. కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం. కమాండ్ ఏరియా డెవలప్‌మెంట్ ప్రోగ్రాం, డెజర్ట్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం, ట్రైబల్ ఏరియా ప్రోగ్రాం, హిల్ ఏరియా ప్రోగ్రాం, ట్రయినింగ్ ఆఫ్ రూరల్ యూత్ ఫర్ సెల్ఫ్ ఎంప్లాయిమెంట్ ప్రోగ్రాం మరియు చిన్న, సన్నకారు రైతులు - వ్యవసాయ కార్మికుల కొరకు పథకాలు జవహర్ రోజ్‌గార్ యోజన మొదలైనవి ప్రభుత్వం ప్రారంభించడం జరిగింది.

1975వ సంవత్సరము నుండి అమలులో ఉన్న 20 అంశాల కార్యక్రమాన్ని మార్పులతో మరల 1988లో ప్రభుత్వం ప్రకటించింది. క్రొత్త 20 అంశాల కార్యక్రమం యొక్క ముఖ్యోద్దేశ్యము. సత్వర అభివృద్ధి, సమాజములోని బలహీన వర్గాల ప్రజల జీవన ప్రమాణము పెరుగుదలకు అవసరమైన ఆహారం ఆశ్రయం వైద్యం విద్య మొదలైన సదుపాయములను ఏర్పాటు చేయడము.

సమీకృత గ్రామీణ అభివృద్ధి పథకం ఇన్‌టిగ్రేటెడ్ రూరల్ డెవలప్‌మెంట్ ప్రోగ్రాం 1976-77వ సంవత్సరములో ప్రారంభించడం జరిగింది. గ్రామీణ ప్రజల జీవితాలలో విప్లవాత్మకమైన మార్పులు తీసుకురావడము ఈ పథకము యొక్క ముఖ్యోద్దేశ్యం . మరియు సాంఘిక, ఆర్థిక మార్పులు, వెనుకబడినతనమును నిర్మూలించడము. ఒక నిర్ణీత కాలములో దారిద్ర్యమును పారద్రోలుట ఈ పథకము ఉద్దేశ్యము. దీనికింద దేశంలో ఉన్న 5,011 బ్యాంకులకు సమగ్ర ప్రణాళికారూపంలో విస్తరింపజేయడం జరిగింది. కేంద్ర ప్రభుత్వం చేత ప్రారంభించబడిన ఈ పథకంలో వాణిజ్య బ్యాంకులు ప్రముఖపాత్ర వహించుచున్నవి. జిల్లాస్థాయిలలో దీని అమలు జిల్లా గ్రామీణాభివృద్ధి ఏజన్సీ (DRDA) పూర్తికాలము పనిచేయు ప్రాజెక్టు డైరెక్టరు ఆధ్వర్యములో నిర్వహించబడుచున్నది.

గ్రామీణ పేదప్రజలకు ప్రారంభించిన పథకాలలోను గ్రామీణాభివృద్ధి కార్యక్రమం, చిన్న రైతుల అభివృద్ధి ఏజెన్సీ (SFDA), జాతీయ గ్రామీణ ఉపాధికార్యక్రమం (NRFD), కనీస అవసరాల కార్యక్రమం మొదలైనవి సమీకృత గ్రామీణాభివృద్ధి పథకం కిందకు తేబడ్డాయి.

గ్రామీణ కుటుంబాలకు చెందిన యువకులకు ఉపాధి కల్పన కొరకు ఈ పథకాలను ప్రారంభించారు. వీరికి అవసరమైన శిక్షణ, నిపుణత సమకూర్చుతారు. ఈ పథకంలోను భాగంగా విత్తనాల ఉత్పత్తి, చేపల పెంపకం, పశుపోషణ, అటవీ ఉత్పత్తుల విషయాలకు ప్రత్యేక శిక్షణ ఇవ్వడం జరుగుతుంది. నెహ్రూ రోజ్‌గార్ యోజన దేశంలోని గ్రామీణ ప్రాంతాల జనబాహుళ్యము కొరకు ప్రభుత్వము ప్రవేశపెట్టింది. ఇప్పటివరకు జరుగుతున్న గ్రామీణ వేతన ఉపాధి పథకాలన్నీ నెహ్రూ రోజ్‌గార్ యోజన పథకంలో విలీనం చేశారు. సమీకృత గ్రామీణాభివృద్ధి పథకాలలో జాతీయ గ్రామీణ ఉపాధి కల్పనాపథకం మరియు చిన్నరైతుల అభివృద్ధి సంస్థ వంటి పథకాలు గ్రామీణ దారిద్ర్యాన్ని నిర్మూలించలేక పోయాయి. దీనికి కారణాలు పరిపాలనాపరమైన అసమర్థత, పట్టణ ప్రాంతాలకు అధిక ప్రాధాన్యత ఇవ్వడం, రాజకీయ జోక్యం, అధికార వర్గాలలో తగిన ప్రతిస్పందన లేకపోవడం, వినూత్న పద్ధతుల్లో యాజమాన్య పద్ధతులు ఉపయోగించలేకపోవుట, సంస్థాగత బలహీనతలు మొదలైన కారణాలు వల్ల ఆచరణలో అనుకొన్న ఫలితాలను సాధించలేదు.

కొన్ని సందర్భాలలో లబ్ధిదారులు ఆర్థికపరమైన నిర్ణీత లక్ష్యములను చేరుకోవడం, కొన్ని ప్రాంతాలలో ఈ లక్ష్యాలను అధిగమించడం గూడా జరిగింది. కాని వాస్తవంలో ప్రగతి అనుకున్న దానికంటే చాలా తక్కువ జరిగింది. ప్రతి బ్లాకులో భౌతిక లక్ష్యాలు జనాభా ప్రాతిపదిక మీద కాకుండా ఏకపక్ష నిర్ణయం జరిగింది. లబ్ధిదారుల యొక్క ఎంపిక విషయంలో లోటుపాట్లు ఉండడము ఈ పథకం విఫలం కావడానికి కారణమని చెప్పవచ్చును. అభివృద్ధి పథకములకై నిర్దేశించిన జిల్లాస్థాయి అధికారులు, ఏజెన్సీలు తగిన ప్రోత్సాహం చూపనందువల్ల విజయవంతం కాలేదు.

గ్రామీణ దారిద్ర్య నిర్మూలనా పథకాలు విజయవంతం కావాలంటే, గ్రామీణ ప్రజలు సంఘటితం కావాలి. వారికి లభిస్తున్న పథకముల విషయ పరిజ్ఞానమే కాకుండా, క్రమశిక్షణ, అవసరమైన యాజమాన్య మెళకువలు తెలుసుకొనవలెను. పథకముల నిర్వహణలో ఆశ్రిత పక్షపాతము, అవినీతి, నిధుల దుర్వినియోగం, వృథా, అసమర్థ పంపిణీ విధానం నివారణకు చర్యలు తీసుకొనవలయును. వ్యవసాయదారుల చేతివృత్తుల వారికి ఉద్దేశింపబడిన ఏ పథకానికైనా తగిన శాస్త్రీయ పద్ధతిలో వారికి శిక్షణ ఇవ్వడం ద్వారా,

వృత్తిపరమైన మెళకువలు నేర్పడం ద్వారా పథకాలను విజయవంతం చేయవచ్చును. తయారైన వస్తువుల మార్కెటింగ్‌కు అవసరమైన సదుపాయములు, తగిన మద్దతు ధర కల్పించవలెను. ప్రభుత్వమే కాకుండా సేవాసంస్థలు, సాంఘిక కార్యకర్తలు తమ వంతు పాత్ర నిర్వహించుటకు ముందుకు రావాలి. గ్రామీణ ప్రాంతాలలో సామాజిక స్పృహ కలిగించవలసిన అవసరం ఎంతైనా వుంది. దీనివల్ల సాంఘిక ఐకమత్యంతో అభివృద్ధి కార్యక్రమాలలో పాలు పంచుకొనుటకు వీలున్నది. స్థానిక సమస్యలను దృష్టిలో ఉంచుకొని స్థానికులను ప్రోత్సహించడం, ప్రణాళికల అమలులో వివిధ సంస్థల నిర్మాణాత్మకమైన కార్యక్రమాలను నిర్వహించడం వల్ల పథకాలు విజయవంతమవుతాయి. వివిధ పథకముల అమలుకు శిక్షితులైన, సమర్థులైన వ్యక్తులను నియమించవలెను. మానవ వనరులను సక్రమంగా ఉపయోగించకపోవడం వల్ల అభివృద్ధి పథకాలు ఆచరణలో విజయవంతం కావడం లేదు.

గతంలో ఏడవ తరగతి చదివినా ఉద్యోగాలు దొరికేవి. కాని నేడు పోస్టుగ్రాడ్యుయేషన్ చేసినా ఉద్యోగం దొరకడం లేదు. ప్రతి సంవత్సరం లక్షలాది మంది విద్యార్థులు డిగ్రీలు తీసుకొని బ్రతుకుదెరువు కోసం ఉద్యోగాల వేటలో పడుతున్నారు. దీంతో విద్యాలయాలు నిరుద్యోగులను ఉత్పత్తి చేసే కర్మాగారాలుగా మారాయి. నిరక్షరాస్యులైన వారిలో కూడా నిరుద్యోగం పెరుగుతోంది. ప్రతియేడు నిరుద్యోగులు పెద్ద సంఖ్యలో పెరుగుతుండగా అదే నిష్పత్తిలో ఉద్యోగావకాశాలు తగ్గుతున్నాయి. స్థానిక వనరుల ఆధారంగా వీరందరికి ఉపాధి కల్పించడానికి యుద్ధప్రాతిపదికన చర్యలు తీసుకోవాలి. యదార్థ జీవితంలోకి అడుగుపెట్టిన యువతీయువకులు కనీస జీవనోపాధి లేక నిరాశానిస్పృహలతో దీనంగా కాలం గడుపుతున్నారు.

మన దేశంలో దొరికే వనరులను, జనాభాను, ప్రజల మనస్తత్వాన్ని గుర్తించకుండా భారీ పరిశ్రమల స్థాపనకు పూనుకోవడంతో గ్రామీణ కుటీర పరిశ్రమలు, చేతివృత్తులు అడుగంటి పోయి కోట్లాది మంది నిరుద్యోగులయ్యారు. దేశంలో పారిశ్రామికీకరణ మూలంగా వస్తువుల నాణ్యత, ఉత్పత్తి ఎక్కువయ్యాయి. పెద్ద చేప చిన్న చేపను తిన్నట్లుగా, భారీ పరిశ్రమలు పెరిగి కుటీర పరిశ్రమలను, చేతివృత్తులను అణచివేశాయి.

రోజంతా రెక్కలు ముక్కలు చేసుకున్నా డొక్క నిండని పరిస్థితి దాపురించింది. ఆయా చేతివృత్తుల వారు జీవనోపాధి కోసం పట్టణాలకు వలస వెళ్లడంతో నిరుద్యోగ సమస్య తీవ్రమవుతూ ఉంది. గుమస్తాల తయారీ కోసం బ్రిటీషువారు స్థాపించిన విద్యావిధానాన్నే కొన్ని చిన్న మార్పులతో మనం కొనసాగిస్తున్నాం. విద్యార్థి భావి జీవితంలో స్వయం ఉపాధి కల్పించుకొని తన కాళ్లపై తాను నిలబడగలిగే సామర్థ్యాన్ని, ఆత్మవిశ్వాసాన్ని ఈ విద్యావిధానం కల్పించడం లేదు. విద్యార్థులకు శారీరక శ్రమ పట్ల ఏమాత్రం గౌరవం లేదు. ఏ ప్రభుత్వ లేదా ప్రైవేట్ సంస్థల్లో గుమస్తా ఉద్యోగమైనా చేయాలని చూస్తారు తప్ప స్వతంత్రంగా జీవనోపాధికి ప్రయత్నించరు. విద్య విజ్ఞానం కల్గించడానికి మాత్రమే కాకుండా జీవితంలో ఉపాధి కల్పించేదిగా కూడా ఉండాలి. దీనికోసం వృత్తి విద్యా కోర్సులను, సాంకేతిక విద్యను అభివృద్ధి పరచాలి. శిక్షణ ఇస్తే భవిష్యత్‌లో ప్రభుత్వ ఉద్యోగం కోసం ఎదురుచూడకుండా తమంతట తామే జీవనోపాధి కల్పించుకుంటారు. ఎంతో ఆలోచించి వాస్తవానికి దగ్గరగా ప్రణాళికలను రూపొందించి అమలు చేస్తేనే, సమస్యలను పరిష్కరించ గలుగుతాం. లేకపోతే సమస్యలు మరింత జటిలమయ్యే ప్రమాదం ఉంటుంది.

ॐ

# గ్రామీణ పరిశ్రమలు - దేశప్రగతికి పట్టుకొమ్మలు

పట్టణాలలో పరిశ్రమలను నెలకొల్పడం గ్రామప్రాంత ప్రజలకు ఏ విధంగానూ శ్రేయస్కరం కాదని గాంధీజీ అన్నారు. గ్రామీణ ప్రాంతాలలో కుటీర పరిశ్రమలను, చిన్నతరహా పరిశ్రమలను స్థాపించి ఏ గ్రామానికి కావలసిన ఉత్పత్తి ఆ గ్రామంలో తయారు చేయగలిగిననాడు దేశంలోని నిరుద్యోగ సమస్యనూ, వ్యాపారంలోని పోటీని అరికట్టవచ్చును. భారీపరిశ్రమలకు, యంత్రాలకు గాంధీజీ వ్యతిరేకి కాదు. విధ్వంసానికి దారి తీసే యంత్రాలను తాను వ్యతిరేకిస్తానని గాంధీజీ ప్రకటించారు. వ్యక్తిశ్రమను తగ్గించే సామాన్య పరికరాలను, పనిముట్లను, యంత్రాలను తాను కోరుతానని కూడా ఆయన పేర్కొన్నారు. కర్మాగార సంస్థను పేర్కొంటూ గాంధీజీ అది కేవలం కొంతమంది పెట్టుబడిదార్ల స్వలాభాలకు మాత్రమే ఉపయోగిస్తుందనీ, నిరుద్యోగ సమస్యను తీర్చలేదని అభిప్రాయపడ్డారు.

వ్యవసాయం, పరిశ్రమలు, విద్య, ఆరోగ్యం, సాంఘిక సంక్షేమం, పశుపోషణం, విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలు మొదలైన కార్యక్రమాలు మన గ్రామాలలో స్వయం సమృద్ధిని సాధించడానికి సహాయపడతాయి. వ్యవసాయ రంగంలో కొంతవరకు అభివృద్ధి సాధించినప్పటికీ, పరిశ్రమల విషయంలో మన గ్రామాలు ఆశించినంతగా ముందంజ వేయలేదని చెప్పక తప్పదు.

గ్రామప్రాంతాలలో పరిశ్రమలు నెలకొల్పడానికి అనేక సమస్యలు, ఇబ్బందులు ఆటంకాలు ఉంటున్నాయి. మన గ్రామప్రజలలోని నిరక్షరాస్యత నానాటికి పెరుగుతుంది. తమ పిల్లలు కుటుంబ ఆదాయానికి తోడ్పడుతారనే

ఉద్దేశ్యంతో పిల్లల విద్య విషయంలో ఆసక్తి చూపక చిన్న వయస్సులోనే వ్యవసాయ పనులకు, పశువుల తోలకములకు చాలమంది తల్లిదండ్రులు పిల్లలను వినియోగిస్తున్నారు. దానికి తోడు గ్రామాలలోని కొద్దిమంది విద్యావంతులైన వారు పట్టణ ప్రాంతాలకు తరలివెళ్లి పట్టణాలలోనే ఉద్యోగాలు చేయడం గాని, స్వయంఉపాధి పథకం ద్వారా ఆర్థిక సంస్థలు, బ్యాంకులు, ప్రభుత్వం అందజేస్తున్న ఋణ సహాయంతో వృత్తులను చేపట్టడం గాని, చిన్నతరహా పరిశ్రమలను స్థాపించడం గాని జరుగుతోంది. గ్రామప్రాంతాలకు చెందిన విద్యావంతులు ఆయా గ్రామాలలోనే తమ పరిజ్ఞానాన్ని మరింత అభివృద్ధి చేసుకోవటానికి కృషి చేస్తూ గ్రామాలలో ఆధునిక శాస్త్రీయ విధానాల ద్వారా వ్యవసాయ పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి పాటుపడినప్పుడు గ్రామాల ఆర్థిక పరిస్థితులు మెరుగు పరచుకోవచ్చును. స్వయంఉపాధి పథకం ద్వారా ధనసహాయం అందజేసేటప్పుడు గ్రామాలకు చెందిన విద్యావంతులు గ్రామాలలోనే వారు తమ వృత్తి చేపట్టడం, పరిశ్రమలు గాని, వ్యాపారం గాని చేయడం వంటి ఆంక్షలు విధించవలసిన అవసరం ఎంతైనా ఉంది.

అభివృద్ధి చెందుతున్న దేశంలో వ్యవసాయానికి ప్రాధాన్యత ఇచ్చినప్పుడే పారిశ్రామికాభివృద్ధి సాధించవచ్చును. గ్రామప్రాంతాలలోని ధనవంతులు వ్యవసాయాభివృద్ధికి సుముఖంగా ఉన్నప్పటికీ పురాతన విధానాలనే అనుసరించడము వలన ఉత్పత్తి పెరగడానికి తోడ్పడటం లేదు. ఆదాయం లేని వ్యవసాయంలో కూలి గిట్టుబాటు లేని వ్యవసాయ కూలీలు పట్టణ ప్రాంతాలలో పూటలు గడుపుకునే వృత్తులు చేపట్టడం వలన వ్యవసాయం దెబ్బ తింటూవుంది.

అంతేగాకుండా తగిన నీటివనరులు లేక వ్యవసాయదారులు తమ వృత్తిలో విశ్వాసాన్ని కోల్పోతున్నారు. గ్రామాభివృద్ధి అధికారుల విద్యావిధానాల ద్వారా ప్రజలలో చైతన్యం కలగజేయడానికి ప్రయత్నాలు చేసినప్పటికీ ఆశించినంతగ రైతులు ఆధునిక విధానాలను చేపట్టడానికి ముందుకు రావడం లేదు. రసాయనిక ఎరువులను వేయడం, వ్యవసాయానికి ట్రాక్టర్లను ఉపయోగించడం వంటివి పెద్ద భూస్వాములు మాత్రమే చేస్తున్నారు.

పరిశ్రమలు నెలకొల్పాలనే సంకల్పం ఉన్నప్పటికీ కొంతమంది భూస్వాములు తగిన అనుభవం, పరిజ్ఞానం లేక వాటిని నెలకొల్పడానికి సాహసించడం లేదు. కాబట్టి గ్రామప్రాంతాలలో పరిశ్రమల ప్రాముఖ్యతను వివరిస్తూ విరివిగా విద్యాకార్యక్రమములను నిర్వహించవలయును. గ్రామాలలో పరిశ్రమలు నెలకొల్పలేని వారిని ప్రోత్సహించడానికి ప్రభుత్వం గ్రామాలలో రవాణా సౌకర్యాభివృద్ధి చేయడం, ముడిసరుకు సరఫరా చేయడం, పన్నుల రాయితీలు ఇవ్వడం, సాంకేతిక సహాయం అందజేయడం వంటివి చేయాలి. చిన్నతరహా పరిశ్రమల ద్వారా వ్యవసాయపు పనిముట్లను గ్రామాలలోనే తయారుచేసి అతి తక్కువ ధరకు లభించడమే గాక కొంతమందికి ఉపాధి కూడా కలుగజేయ వీలవుతుంది.

గ్రామప్రాంతాలలో పరిశ్రమలను అభివృద్ధి చేసేముందు గ్రామాల సాంఘిక, ఆర్థిక వ్యవస్థలలో మార్పును తీసుకరావలసి వుంది. స్థానిక వనరులను గుర్తించి ఆ వనరులను సద్వినియోగం చేసికోవడానికి ప్రయత్నించినప్పుడే పరిశ్రమలను అభివృద్ధి చేయడానికి అవకాశాలున్నాయి. గ్రామాలలో విద్య, ఆరోగ్యం, నీటిసదుపాయాలు, విద్యుచ్ఛక్తి, రవాణా సౌకర్యాలు అభివృద్ధి చేసినప్పుడే ఆర్థికాభ్యుదయాన్ని సాధించవచ్చును. గ్రామాలలో ఉత్పత్తి అయ్యే సరుకులకు తగు వ్యాపార సదుపాయాలు గ్రామాలలోను, పట్టణాలలోను విస్తృతం చేయడం ద్వార గ్రామీణ పరిశ్రమలు పట్టణాలలోని చిన్నతరహా పరిశ్రమల పోటీని ఎదురుకొనవచ్చును.తక్కువ మొత్తాలలో చిన్నతరహా పరిశ్రమలు తయారుచేసిన విడిభాగాలను ఉపయోగించడం భారీపరిశ్రమలకు లాభదాయకం. చిన్నతరహా పరిశ్రమలను పోటీ పరిశ్రమలుగా భారీ పరిశ్రమలు భావించక వాటిని సహాయ పరిశ్రమలుగా భావించినప్పుడు రెండు రకాల పరిశ్రమలు కూడ ఒకదాని సహాయంతో మరొకటి అభివృద్ధి చెందవచ్చును. సాంకేతిక శిక్షణ పొందిన వారికి చిన్నతరహా పరిశ్రమలలో స్థానం ఇవ్వవలసి వుంది. అప్పుడే అవి భారీ పరిశ్రమలకు అవసరమయ్యే విధంగా భాగాలను తయారుజేసి తక్కువ ధరకు వాటిని సరఫరా చేయవచ్చును.

కొన్ని కొన్ని గ్రామప్రాంతాలను ఎన్నుకొని స్థానిక వనరులు, ముడి

సరుకులు ఉపయోగపడునట్లు ఆయా గ్రామాలలో ప్రభుత్వం పరిశ్రమలను నెలకొల్పవలయును.

కేంద్ర ప్రభుత్వం తలపెట్టిన గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమాలు విజయవంతం చేయడానికి గ్రామీణ ప్రజలు, సంస్థలు ముందుకు రావాలి. భారీపరిశ్రమల యజమానులు, పెట్టుబడిదారులు వారి పోటీ వైఖరికి స్వస్తి చెప్పి చిన్నతరహా పరిశ్రమలు తయారుచేసే విడిభాగాలను వారు ప్రోత్సహించాలి. జాతిపిత మహాత్మాగాంధీ ఆశయాలకు అనుగుణంగా గ్రామీణ పరిశ్రమలను అభివృద్ధి చేసిననాడు మన గ్రామాలు స్వయం సమృద్ధిని సాధించి, సాంఘిక, ఆర్థిక వ్యవస్థల అభ్యున్నతికి తోడ్పడుతాయి.

రాష్ట్రంలో దాదాపు 27 వేల గ్రామాలు, 15 వేల పంచాయతీలు వున్నాయి. సమిష్టి కుటుంబాలుగా ఉన్నవారంతా విభజన కావడంతో చిన్న కమతాలయ్యాయి. ఒకటి రెండు హెక్టేర్ల భూమి ఉన్నవారు ఎక్కువయ్యారు. అక్షర జ్ఞానం ఉన్నవారు నూటికి నలభైమందిలోనే. కాస్త చదువుకున్నవారు కూడ తమకున్న రెండు హెక్టేర్ల భూమిని ఎలా ఉపయోగించుకోవాలో తెలుసుకోవడం లేదు. హెచ్చుతరగతులు చదివినవారు పట్టణాలలోని ఉద్యోగాల కోసం పరిగెత్తి నిరాశతో తిరుగుతున్నారు. ప్రాథమిక విద్య, ఉన్నతవిద్య చదివిన యువతీయువకులు చాలామంది తమకున్న వనరుల వినియోగం తెలియక వృథాగా కాలం గడుపుతున్నారు. దురలవాట్లకు లోనయ్యే అవకాశము ప్రమాదమూ వుంది.

గ్రామీణ యువతీయువకులు పెద్ద పెట్టుబడి లేకుండానే స్వయంగా చేపట్టి తమకు జీవనోపాధి కల్పించుకునే కార్యక్రమాలు చాలా వున్నాయి. పండ్ల తోటలు సాగుచేయాలనేవారికి సాధ్యమైన అంట్లు లభించడము లేదు. నాణ్యమైన చెట్లను ఎన్నిక చేసి వాటినుండి కట్టిన అంట్లు, మొగంట్లకు చాలా డిమాండు ఉంది. ఆడవాళ్లు కూడా ఈ పని నేర్చుకోవచ్చు. పండ్లకోత, కోసిన పండ్లను భద్రపరచడం, రవాణాకు ప్యాకు చేయడం మొదలైన వాటిలో కూడా క్రొత్త పద్ధతులున్నాయి. దానిలో మెలకువలు నేర్చుకుంటే చెడిపోయే పండ్ల సంఖ్య బాగా తగ్గుతుంది. అధిక ఆదాయం వస్తుంది. నాణ్యత పెంచితే విదేశాలకు ఎగుమతులు పెరుగుతాయి.

ఒక హెక్టేరులో మల్బరీ సాగుచేసి పట్టుకాయలి ఉత్పత్తి చేపడితే భార్యాభర్తలకు సంవత్సరం పొడుగనా పని వుంటుంది. ఒక హెక్టేరు భూసాగులో ఆరు పాడి పశువులను పెంచి పాల ఉత్పత్తి చేపట్టవచ్చు. మాంసానికి డిమాండు పెరుగుతోంది. ఉత్పత్తి చాలడం లేదు. మేకలను, గొర్రెలను పెంచే భూములు లేవు. సాంప్రదాయ పద్ధతిపై ఇండ్ల వద్ద కొట్టంలో పెంచే విధానాలను చేపట్టవచ్చును. పొలంలో గడ్డిసాగు, ఇంట్లో జీవాల పెంపకంలో యువతీయువకులు పనులను పంచుకోవచ్చు.

ఈ విధంగా గ్రామీణ వ్యవసాయ పరిశ్రమలలో ముఖ్యమైనది పాడిపరిశ్రమ. పాడిపంటలు పుష్కలంగా ఉన్న సంవత్సరము రైతులకు నిజమైన పండుగ. పుష్కలమైన ఉత్పత్తులకు సరియైన గిట్టుబాటు ధర పలికినపుడే గ్రామాలు ఆర్థికంగా అభివృద్ధి చెందుతాయి. మన దేశంలో జనాభాతో పాటు నిరుద్యోగుల సంఖ్య కూడా బాగా పెరుగుతోంది. గ్రామాలలోని వనరులనే ఉపయోగించుకొని జీవనాధారం కల్పించుకోవడం ఎంతైనా అవసరం.

అనుకూల పరిస్థితులున్న చోటల్లా పాడిపశువుల పోషణ చేపట్టి చిన్న డెయిరీలు ప్రారంభించి పాల ఉత్పత్తికి తోడ్పడవచ్చు. మార్కెటు ఉంటే పాలను గ్రామాలలోనే అమ్మవచ్చును. లేనియెడల దగ్గరలో నున్న పట్టణాలకు తీసికెళ్లి అమ్మవచ్చు. అమ్మగా మిగిలిన పాలనుండి పాల ఉత్పత్తులను తయారు చేసుకోవచ్చును. మార్కెట్ లేనప్పుడు వెన్న, నెయ్యి తయారుచేసి మార్కెటింగ్ చేయవచ్చు. కరెంటు ఉన్నచోట పాలను చల్లదనం చేసే యంత్రాలు, రిఫ్రిజింరేటర్‌లు, బాటిల్ కూలర్లు పెట్టుకొని పాలను, పాల ఉత్పత్తులను నిల్వజేసి పట్టణంలో అమ్ముకోవచ్చును.

పాలతో పెరుగు, పుల్లటి పెరుగు, స్వీట్ స్వీటెండ్ మోగర్టు, శ్రీఖండ్, మజ్జిగ, లస్సీ, బాదంపాలు, స్టెరిలైజ్డ్‌పాలు, మిల్క్‌షేక్ కోవా, పనీర్ యెన్నో రకాల ఉత్పత్తులను చేసి మార్కెటింగ్ చేసుకోవచ్చు.

కోళ్ల పరిశ్రమలో అధిక లాభాలు గడిస్తూ ఎంతోమంది నేడు ఉపాధి కల్పించుకున్నారు. పల్లె నుండి మొదలుకొని ఢిల్లీ వరకు గుడ్ల రవాణా జరుగుతూవుంది. సామాన్యునికి అందుబాటులో కూరగాయల కన్న చౌకగా, పసిపాపల నుండి పండు ముదుసలి వరకు పసందైన ఆహారంగా గుడ్డు

నిలిచింది. నిలువలు దాచాలి, మార్కెట్ లేదు అనే అపనింద పడనిది గుడ్ల మార్కెట్. అందువలన కోళ్ల పరిశ్రమలో అధికోత్పత్తి సాధించాలంటే ఉత్తమమైన కోళ్లజాతుల ఎన్నికతో పాటుగా పుష్టికరమైన మేత సమకూర్చాలి. పెంచే రకాన్ని బట్టి వివిధ వయస్సులలోని కోళ్లకు సమకూర్చవలసిన పోషక పదార్థాల విలువలు, పరిమాణం మారుతుంటాయి మాంసోత్పాదనకు వినియోగించే బ్రాయిలర్ రకం కోళ్లు అతి వేగంగా పెరిగే స్వభావం కలిగినందున వాటి పెరుగుదలకు అనువైన మాంసకృత్తులను, శక్తినిచ్చే పోషక పదార్ధాలను తగు పరిమాణంలో అందజేయాలి. రోగనిరోధక చర్యలను తీసుకుంటూ జాగ్రత్తలు వహిస్తే లాభదాయకమైన పరిశ్రమ ఇది.

## తేనెటీగల పరిశ్రమ:

తేనెటీగల పరిశ్రమ కనువైన సహజవనరుల గురించి ఆలోచించితే ప్రపంచంలోకెల్లా మన దేశం మొట్టమొదటి స్థానంలో వుంది. కాని తేనెటీగల పరిశ్రమ, తేనె ఉత్పాదన విషయంలో మనం చిట్టచివర ఉన్నాం. శీతల దేశాలైన అమెరికా సంయుక్త రాష్ట్రాలు, ఆస్ట్రేలియా, న్యూజీలాండు వంటి దేశాలలో చెట్లు ఫలపుష్టిభరితంగా వుండేది. సంవత్సరంలో కొద్దికాలం మాత్రమే, మిగతా కాలమంతా మంచుతో కప్పబడి వుంటాయి. తేనెటీగల పరిశ్రమకు ముడిపదార్ధం పుష్పాలలోని మకరందం. అతి తక్కువగా అవకాశాలున్న ఆ శీతల దేశాలలో తేనె వుత్పత్తి మిలియనుల టన్నులు కాగా, సంవత్సరం పొడవునా సస్యశ్యామలంగా ఫలపుష్ప భరితమైన ప్రకృతి నుంచి కనీసం 5 శాతం మకరందాన్నయినా మనం తేనెగా మార్చుకోలేకపోతున్నాం. దానికి ముఖ్యంగా కొన్ని కారణాలు చెప్పవచ్చు. రైతుల అశ్రద్ధ కాలానుగుణంగా వ్యవసాయపనులు సాగించే మన రైతాంగం సంవత్సరంలో సగంకాలం ఖాళీగానే వుంటారు. తేనెటీగల పెంపకం వంటి వ్యవసాయపరమైన చిన్న పరిశ్రమను చేపట్టరు. మరో విషయం ప్రభుత్వ నిర్లక్ష్య వైఖరి వల్ల తగినంత సాంకేతిక పరిజ్ఞానం అవసరమైన వారికి అందుబాటులో లేక మన ప్రకృతిలో 95 శాతం మకరందాన్ని వృథా పరుచుకుంటున్నాం.

**ఇక మరో పరిశ్రమ:**

ఆదివారం రోజున మాంసాహార దినంగా భావించడం పట్టణాలలో ఆనవాయితీ అయింది. పల్లెల్లో పండుగలకు, విందులకు మాత్రమే తీసికొనేవారు. ఇప్పుడు అందరూ అలవాటు పడ్డారు.

మన దేశంలో సగటు మాంసం వాడకం ప్రపంచంలో సగటు మాంసం వాడకం కన్నా చాల తక్కువగా వున్నా దినదినం యాట మాంసం ప్రియమై పోయింది. దానికి కారణం పెరుగుతున్న మాంసాహారులు, తరుగుతున్న గొర్రెలు, మేకలు.

గ్రామీణ ప్రజలు ఇది గ్రహిస్తే గొర్రెలు, మేకలు, కోళ్లు, పందులు, కుందేళ్లు, కౌంజులు పెంచి, ఆర్థిక వనరులను ఆదాయక్రమాన్ని పెంచుకోవచ్చు. తమ అందుబాటులో వున్న గ్రామీణ పరిశ్రమలను తలంచక గ్రామప్రజలు పట్టణాలపై మోజుతో వలస వెళ్లి కూలీలుగా, రిక్షా లాగువారిగా శక్తిని, యౌవనాన్ని వృథా చేసి సరియైన జీవనోపాధి, వుండటానికి గృహవసతులు లేక మురికివాడలలో నివాసం ఏర్పరచుకొని అనారోగ్యానికి గురికావడం జరుగుతూవుంది. జనం పెరిగిన, పట్టణంలో కలుషితం పెరిగి, ప్రమాదాలకు గురియై అకాల మరణాలు సంభవిస్తున్నాయి.

జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థ ద్వారా మరియు హరిజన గిరిజన సంక్షేమ శాఖల ద్వారా ప్రభుత్వం గ్రామీణ ప్రజలకు ఎన్నో రకాల రాయితీలను ఏర్పాటు చేస్తూ వుంది. చిన్నతరహా పరిశ్రమలకు ఋణాలను అందజేస్తూ రాయితీలను యిచ్చి చేతిపరిశ్రమలను వ్యవసాయ పరిశ్రమలను ప్రోత్సహిస్తూ వుంది. గొట్టపుబావులు, సామూహిక అడవుల పెంపకానికి, నర్సరీలు పెంచుటకు ఆర్థిక సహకారం అందిస్తూ ఉత్సాహపరుస్తూ వుంది. వృత్తిపరమైన విద్యను నేర్చుకొనుటకు 'ట్రైజం' లాంటి వసతులు ఏర్పాటయ్యాయి. స్వయంఉపాధి వల్ల కార్మిక, కర్షకుల గౌరవాలు పెరుగుతాయి. నైతికంగా గ్రామప్రజలు మనోధైర్యాన్ని పెంచుకోగలుగుతారు.

తోటల పెంపకం చేపట్టిన రైతు సోదరులకు ప్రభుత్వం వాటర్‌షెడ్ స్కీం క్రింద మేలురకమైన పండ్ల మొక్కలను ఉచితముగా పంపిణి జరిపి ప్రోత్సహిస్తూ వుంది. పంపుసెట్లు, పైపులు, స్ప్రింక్‌లర్స్ లాంటి ఎన్నో ఏర్పాట్లు రాయితీలపై వసతి కల్పిస్తూ వుంది. నీటి పరీవాహక ప్రాంత అభివృద్ధి పథకము ద్వార భూసంరక్షణ, వరదకట్టలు నిర్మించుట, వ్యవసాయ ప్రదర్శన క్షేత్రముల నిర్వహణ, పచ్చిక బయళ్ల పెంచడం, తోటల, సామాజిక అడవుల పెంపకము, గల్లీ కంట్రోలు వర్క్స్, జీవగట్లు మొదలగు అభివృద్ధికరమైన సహాయ సహకారాలను అందిస్తున్న ప్రభుత్వ లక్ష్యాన్ని గౌరవించి గ్రామీణ ప్రజలు స్వయం పోషకత్వ మేర్పరచుకొని గ్రామాభివృద్ధికి తోడ్పడితే దేశం సస్యశ్యామలమవుతుంది. సౌభాగ్యాన్ని సమకూర్చుకుంటుంది. మానవకృషికి ప్రకృతి సహకారం తోడైత, నాడే సుజలాం, సుఫలాం మలయజ శీతలాం సస్యశ్యామలాం మాతరం, వందేమాతరం.

# శతకకర్తలు-నీతికి నిధులు

తెలుగుసీమలో పండితులు మొదలు పామరుల వరకు గల ప్రజాసముదాయానికి బాగా తెలిసిన మహనీయులు - వేమన, సుమతులు.

మర్మమెరిగిన పరమ ప్రబోధకులు, మంచి చెడులను, ధర్మాధర్మాలను, న్యాయాన్యాయాలను, హితాహితాలను గుర్తెరిగిన గుణధీయుతులు. లోకసత్యాలను అనుసరించదగ్గ అంశాలను వివరించగల వివేకులు. వీరిద్దరూ జీవితసారాన్ని అందంగా మనస్సులకు విందుగా, పసందుగా సరళసుందరంగా మరపురాని రీతిని హృదయానికి హత్తుకునేలా చెప్పగలిగిన విజ్ఞానఖనులు - ప్రజాకవులు.

మనిషి ఆశాజీవి. తన ఆశించినది సాధించుటకు అహర్నిషలు నిద్రాహారాలను మరిచి కూడా ఆరాటపడుతున్నాడు. ఎంతకూ తీరని ధనదాహం వలన మనిషి ఎన్నో వికృత రూపాలు ధరించవలసి వస్తుంది. సంపదల కోసమే ఎన్నో కష్టనష్టాలకు లోనవుతూ వుంటారు. అయినా మానుకుంటారా అంటే మానుకోరు. పైపెచ్చు అష్టకష్టాలకు లోనై సంపాదించి అనుభవించకుండానే దాచిపెట్టి పరుల పాలు చేస్తూపోతూ వుంటారు. ఇది లోక సహజ విషయం. ఈ అంశాన్ని వేమన చక్కగా వివరించాడు.

ధనము కూడబెట్టి ధర్మంబు సేయక
తాను దినక లెస్స దాచుగాక
తేనెటీగ గూర్చి తెరవరి కియ్యదా
విశ్వదాభిరామ వినురవేమ.

మనిషి ధనాన్ని సమకూర్చడానికి ఎన్నో ఘోరమైన, క్రూరమైన ఆలోచనలు చేస్తూ వున్నాడు. ఎదుటి మనిషిని పీడించి, హింసించి చివరికి హత్యలకైననూ వెనుకాడక ధనదాహం పెంచుకుంటూ వున్నాడు. చివరి దశలో

తను అనుభవించలేక, ఈ ఆరాటంలో ఆరోగ్యం క్షీణించి ఆహారం కూడా జీర్ణించుకోలేని స్థితికి చేరుతున్నాడు.

తేనెటీగ పూవూ పూవూ తిరిగి మకరందాన్ని గ్రోలుతుంది. కాని పూవులకు ఏ హాని చేయదు. తాను కూర్చిన తేనె పరులకు దక్కుతుంది. సమాజానికి ఉపయోగపడుతుంది.

ఇంటిలోని ధనము ఇది నాది యనుచును
మంటిలోన దాచు మంకుజీవి
కొంచబోడు వెంట గుల్ల కాసైనను
విశ్వదాభిరామ వినురవేమ.

ఇలాంటి జీవిత సత్యాలను నీతిని విజ్ఞులు, అనుభవజ్ఞులు బోధిస్తూనే వున్నారు. కానీ ఎవరూ తృప్తి చెందడము లేదు. పైగా వైరాలు పెంచుకుంటూ వున్నారు. కోపతాపాలు పెరుగుతూ వున్నాయి. కోపాలు వైషమ్యాలకు దారి తీస్తూ వున్నాయి. ఎన్నో రకాల పతనాలు జరుగుతూయున్నాయి.

మనిషికి కోపం ఎంతో కీడు చేస్తూ వుంటుందని వేమన బోధించారు.

కోపమున ఘనత కొంచెమై పోవును
కోపముననె మిగుల గోడు చెందు.
కోపమడచనేని కోరికలీడేరు
విశ్వదాభిరామ వినురవేమ.

కోపము మనకు ఎన్ని రకాల కీడును చేస్తుందో కీర్తిప్రతిష్ఠలను మంటగలుపుతుందో వేమన వివరిస్తూ-

కోపముననె నరక కూపము జెందును
కోపముననె గుణము కొంచమగును
కోపముననె బ్రతుకు కొంచెమై పోవును
విశ్వదాభిరామ వినురవేమ.

కోపము వలన చివరికి ఆయుష్షు కూడా క్షీణిస్తుంది. ఎన్నో అనర్థాలు సంభవిస్తాయి.

కాబట్టి శాంతి స్వభావాన్ని సౌమ్యాన్ని నమ్రతను అలవర్చుకోవాలి - ప్రశాంత జీవితాన్ని గడపాలి.



# మాతృదేశం

జనగణమన అధినాయక జయహే!

భారత భాగ్య విధాతా...

అని స్తుతించారు విశ్వకవి రవీంద్రనాథ ఠాగూర్. వందకోట్ల బిడ్డలకు జన్మనిచ్చిన మాతృమూర్తి భారతమాత. 1947కు పూర్వం బ్రిటీషువారి దాస్య శృంఖలాలలో చిక్కుకుని విలవిలలాడింది. పోరాటంలో శత్రువుల తుపాకి గుండ్లకు గుండెలను ఎదురొడ్డి, ప్రాణాలర్పించిన తన లక్షల బిడ్డల రక్తం ఏరులై పారిన రోజు, శవాలు కుప్పలు తెప్పలుగా కన్పించినరోజు కంట తడిపెట్టింది. కడుపుకోతకు గుండెలవిశేలా కుమిలికుమిలిపోయింది భారతమాత.

"స్వాతంత్ర్యం బ్రిటీష్ పార్లమెంట్ అనుగ్రహించే ఉచిత బహుమతి కారాదు. అది భారతదేశాన్ని సర్వస్వతంత్ర్య స్థాయిలో వ్యక్తీకరించే ప్రకటన కావాలి. బ్రిటీష్ పార్లమెంట్ రూపొందించే చట్టం ద్వారా వెలువడే అధికారిక ప్రకటనలో సైతం భారతీయుల అభిమతాన్ని గౌరవించే దృక్పథం తప్పనిసరిగా వుండాలి" అన్నారు గాంధీజీ.

భారతదేశ మంతటా అత్యవసరంగా స్థితిని ప్రకటించి, మొత్తం పరిపాలనను గవర్నర్ జనరల్ గుప్పిట్లో ఉంచారు. అతని కింద పనిచేసే గవర్నర్లు, సివిల్ అధికారులు నిర్ణయాన్ని తీసుకుంటూ ప్రజాస్వామ్య స్ఫూర్తిని తుంగలో తొక్కారు. అత్యవసర ఉత్తర్వుల ద్వారా వ్యతిరేకతను, ఉద్యమాన్ని ఎదుర్కోవాలని నిర్ణయించారు. ప్రముఖ భారతనేతల్ని జైళ్లకు పంపించారు.

అయితే రెండేళ్లలో పరిస్థితులు మారాయి. గడ్డురోజుల్ని ఎదుర్కొన్న బ్రిటీష్ ఏలికలు మెట్టు దిగివచ్చారు. భారతనేతలతో రాయబారానికి సీమ ఓడమీద "స్టాఫర్డ్‌క్రిప్స్"ను పంపారు. యుద్ధకాలంలో పాక్షికంగాను, యుద్ధానంతరం పూర్తిగానూ భారతీయులకు అధికారాన్ని అప్పగించగలమనీ, అందుకు ప్రతిగా యుద్ధానికి సహాయ సహకారాలు అందించాల్సి ఉంటుందనీ

క్రిప్స్ ప్రతిపాదించిన సలహాలను, సూత్రాలను నేతలు కాదనడంతో రాయబారం విఫలమైంది. ఇది ఉద్యమకారుల్లో అసహనాన్ని రేకెత్తించింది. అశాంతిని రెచ్చగొట్టింది. ఫలితంగా 1942 బొంబాయి సమావేశంలో 'క్విట్ ఇండియా' నినాదం మిన్నుముట్టింది.

ఆ తరువాత అయిదేండ్లపాటు అనేక చారిత్రక పరిణామాలు గుక్క తిప్పుకోకుండా సంభవించాయి. లేబర్ పార్టీ ఆధ్వర్యంలో బ్రిటన్‌లో ఏర్పడిన ప్రభుత్వం కీలకమైన నిర్ణయాలు తీసుకుంది. 1946 ఫిబ్రవరిలో అప్పటి బ్రిటీష్ ప్రధానమంత్రి క్లెమెంట్ అట్లీ కామన్స్ సభలో చేసిన ప్రకటన రాజ్యాంగ పరమైన సమస్యల పరిష్కారానికి మార్గాన్ని సుగమం చేసింది. మధ్యంతర ప్రభుత్వం ఏర్పాటు, మతపరమైన అలజడులు, గవర్నర్ జనరల్ పదవిలో మౌంట్‌బాటెన్ నియామకం, స్వాతంత్ర్య ప్రకటన, దేశవిభజన లాంటి సంఘటనలు చోటుచేసుకున్నాయి.

స్వాతంత్ర్య ప్రకటనకు రాజ్యాంగ రచన ఆవిష్కరణకు మధ్య మూడేళ్ల వ్యవధిలో స్వతంత్ర భారత్ అంతులేని అవరోధాల్ని ఎదుర్కోవాల్సి వచ్చింది. వాటిలో ప్రధానమైంది చిన్నాచితకా స్వతంత్ర రాజ్యాల ఏకీకరణ. యూనియన్ జాక్ అవనతం కాగానే దేశం స్థూలంగా రెండు ముక్కలై పోయింది. భారతమాతకు కడుపుకోత మిగిలింది. ఒక జాతి జీవితంలోగాని, ఒక ప్రాంత జీవితంలోగాని కాలంతోపాటు మార్పులు తథ్యం. కాని ఆయా మార్పులు ఆ జాతి జీవలక్షణాన్ని దెబ్బ తీసేలా ఉంటే మాత్రం అది తప్పనిసరిగా తన పతనం ఎటువైపు అన్నది పరిశీలించుకోవడం అవసరం. పురోగమనం పేరిట వెర్రితలలు వేసే ధోరణి ప్రబలితే తన దశను, దిశను మార్చుకోవడం తప్పనిసరి. తెలుగుజాతి సరిగ్గా ఇప్పుడు ఈ మలుపులో ఉంది.

ఇరవయ్యేకటో శతాబ్దంలో పయనించే మనం తెలుగుదనాన్ని, తెలుగువారసత్వాన్ని వదులుకుంటామా, కాపాడుకుంటామా అన్నది నేడు ప్రశ్నార్థకంగా నిలిచింది.

"మా తెలుగుతల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు"

అని రాగయుక్తంగా పాడటంతోనే సరిపోదు. మనం తెలుగుతల్లిని ఎంతమాత్రం గౌరవిస్తున్నామో ఆలోచించుకోవడం అవసరం.

మన మాతృభూమికి, జన్మభూమికి, తెలుగుతల్లికి ఎంతో ఋణపడి ఉన్నాం అందరం. జన్మాంతం సేవలందించాలి..... ఇది అందరి కర్తవ్యం.....

# మమకారం

మాతృత్వం, కన్నపేగు, మమకారం, ఇలా తల్లీబిడ్డల మధ్య ఉండే అనురాగాన్నీ, అనుబంధాన్ని సూచించే ఎన్నో మాటలు వింటుంటాం. పితృత్వం, తండ్రిప్రేమ....లాంటివి ఉన్నా వాటికి రెండోస్థానమే ఇచ్చారు. మనుషుల్లో నయినా జంతువుల్లో నయినా తమ సంతానం పట్ల కనబరిచే ప్రేమ తల్లిలోనే ఎక్కువ ఉంటుందన్న భావం ప్రాచుర్యంలో ఉంది. దాన్ని కాదనలేం కూడా! బిడ్డకు జన్మనివ్వడంలో తల్లిదండ్రులిద్దరూ సమాన భాగస్వాములే అయినప్పటికీ, ఆ బిడ్డ పెంపకంలో మాత్రం - తల్లిలా తండ్రి ఎందుకు లాలించడు?....లాంటి ప్రశ్నలకు కన్నపేగు బంధం, నవమాసాలు మోయడం...ఇలాంటి కారణాలు చెప్పవచ్చు. ఇంతకాలం జన్యుశాస్త్రజ్ఞులు వీటినే సమర్థిస్తూ వచ్చారు. అయితే "ఇది పూర్తి నిజం కాదు. తల్లి నుంచి కాకుండా తండ్రినుంచి వంశపారంపర్యంగా వచ్చే ఓ ప్రత్యేకమయిన జన్యువు కారణంగానే స్త్రీ తన బిడ్డల మీద మమకారాన్ని చూపిస్తుంది. అంటే తల్లి పిల్లలమీద చూపించే ప్రేమకు కారణం పురుషుడే"నని చెబుతున్నారు పరిశోధకులు. ఏనాడు కన్నబిడ్డల్ని తాకి, లాలించకపోయినా అతని మనుమలు సరిగ్గా పెరగడానికి దోహదపడేది తాత జన్యువులేనని అంటున్నారు జన్యునిపుణులు. "తల్లి సహజంగా తన పిల్లల మీద చూపే మాతృపరమైన మమకారానికి కారణమైన జన్యువు ఆమెకు తండ్రినుంచే వస్తుంది గానీ తల్లి నుంచి కాదు".

సృష్టి అంతా ప్రేమమయం అని అనడంలో తాత్వికార్థం పక్కనబెట్టి పరిశీలిస్తే సృష్టి అంతా ప్రేమమయం. అంతేకాదు ప్రేమవల్లనే సృష్టి అని అవగతమవుతుంది. ప్రేమ మమకారం లేని జీవితాలలో స్తబ్దత యేర్పడుతుంది. జడత్వం ప్రవేశిస్తుంది.

జీవితం అనేకానేక సమస్యల మధ్య ధ్వంసం అవుతోంది. సజీవంగా ఉండాల్సిన మనుషులు కరెన్సీ చుట్టూ ప్రదక్షిణలు చేస్తున్నారు. జీవితం పరాయీకరణ చెందుతోంది. మనం మనం కాకుండా పోతున్నాం. జీవితం సంకుచితమవుతోంది.

నిరంతరం మనుషులు యంత్రాల్లా, గానుగల్లా తయారవడంతో తమకంటూ ఓ క్షణం తీరిక చేసుకొని మనసుని ఉల్లాసంగా ఉంచుకోవడానికి ఒకింత వెసులుబాటే కొరవడుతుంది. ఇలాంటి పరిస్థితులను అధిగమించి మనకంటూ కొంత సమయాన్ని కేటాయించుకొని మమకారాన్ని పెంచుకుంటేనే జీవితం నవనవలాడుతూ జీవించాలనిపిస్తుంది. ఆయువు ఆరోగ్యం పెరుగుతుంది.

ఊహలు ఎప్పుడూ గుసగుసలాడవు. అలల ఊహలు అసలే వుండవు. అలా నిశ్చలంగా ప్రశ్నార్థకంగానూ ఉండిపోతాయి. ఇలా వుండడానికి జీవితాన్ని ఎప్పుడూ మార్దవంగానూ, ఆర్ద్రంగానూ, ఆప్యాయంగాను, ఆనందంగాను మమకారాన్ని పంచుతూ ఉండడానికి ప్రయత్నించకపోవడం ఒక కారణమైతే, ఈ జీవితం ఇలానే ఉంటుందనే అభిప్రాయం మరో కారణం. ఎప్పుడూ అలసటకు గురిచేసే సమస్యలను పక్కకి పెట్టి, కాసింత ఉల్లాసాన్ని నింపుకోవాలని కోరికలుండేవారు తరుణోపాయాలు వెదుక్కుంటారు. అలాంటి వారే జీవితంలోని మధురిమలను ఆస్వాదిస్తారు. జీవితం చేదుఫలం కాకూడదనుకునేవారు ఏదో ఒక కార్యక్రమాన్ని తీసుకొని ఆచరణలో పెట్టాలి.

మాతృప్రేమను అనురాగాన్ని మమకారాన్ని పొందలేని ఎందరో చిరంజీవులు బాలకార్మికులుగా మారుతున్నారు. జీవితాన్ని పంచి అనురాగం, ఆప్యాయతలతో తమ పిల్లల్ని ఉన్నత శిఖరాలు ఎక్కించినా ఎంతోమంది వృద్ధమాతాపితలు మమకారాన్ని కోల్పోయి రోడ్డున పడుతున్నారు.

పిల్లలని విసుగుతో కొట్టేవారు కూడా వుంటారు. అలా కొట్టడం వల్ల వారి స్వభావం మరింత మొద్దుబారిపోయే అవకాశం వుంటుంది. దండన అన్నది ఆఖరి అస్త్రంగా ఉపయోగించాలి. చీటికి మాటికి దాన్ని ప్రయోగిస్తే "ఓస్ ఇంతే కదా'' అని దానికీ వారు అలవాటు పడిపోతారు. అలాకాకుండా వారు చేసిన పని ఎలా తప్పో వారికి అర్థమయ్యేటట్లు చెప్పాలి.

పెద్దల్లో అయినా, పిల్లల్లో అయినా స్వార్థం అన్నది ఏ కోశానా

పెరగనీయకూడదు. పిల్లల స్థాయిని ఎరిగి వారి మనస్తత్వానికి తగిన విధంగా ప్రయత్నించి వారికి స్వార్థం అబ్బకుండా చూసుకోవాలి. తల్లిదండ్రులు ఎవరూ కావాలని పిల్లల్లో తేడాలు చూపించరు. ఇద్దర్నీ రెండు కళ్లలానే భావిస్తారు.

పిల్లల్ని ప్రేమించేటప్పుడు ప్రేమిస్తూ, తృప్తిపరుస్తూ అనురాగాన్ని, ఆప్యాయతను, మమకారాన్ని పంచుతూ, మందలించాల్సిన సమయంలో మందలిస్తూ పోతే అదే వారి బంగారు వ్యక్తిత్వానికి బాట వేస్తుంది.

